Photo by M. V. Vijayakar



బహుమతి పొందిన వ్యాఖ్య

గ్రామసింహము

పంపినవారు : ఏ. వి. రామయ్య - శ్రీకొలను

# చందమామ

ఈ సంచికలో కథలు
వింతలు - విశేషాలు

★



ఇవి గాక :
చిత్రకథ, ఫొటో శీర్షికల పోటీ,
మొదలైన మరి ఎన్నో
ఆకర్షణలు.



పిల్లలకోసం—

## గిబ్స్ డెంటిఫ్రిస్

రంగులు వేసే రెండవ పోటీ

బహుమతులను పొందినవారు :

1-వ బహుమతి : రాలీ సైకిలు
మాస్టర్ కె. శ్రీనివాసన్,
శ్రీరాంపురం, బెంగళూరు-3.

2-వ బహుమతి :
హెచ్. ఎమ్. వి. గ్రామొఫోను
మాస్టర్ కె. బి. ఎస్. మోహన్,
శ్రీకాకుళం, ఆంధ్రప్రదేశ్.

3-వ బహుమతి :
వ్యూమాస్టర్ ప్రొజెక్టర్ సెట్టు
మాస్టర్ గౌతమ్ వొహ్‌రా,
చాణక్యపురి, న్యూ ఢిల్లీ.

ఇతర బహుమతులను పొందిన 100 మందికి తపాలుద్వారా కంపెనీనుంచి తెలుపబడినవి.

---

## 'చందమామ'కు

ఏజంట్లు లేనిచోట్ల ప్రతి ఊరా చిన్న చిన్న ఏజంట్లు కావాలి. మీరు ఏజంటయి కొద్ది కాపీలుకూడా తెప్పించుకోవచ్చును. మీరు ప్రతి నెలా 3-0-0 పంపుతూవుంటే మీకు 8 కాపీలు పంపుతాము. ఈ పద్ధతిని మీకు ప్రతినెలా 1-0-0 లాభం వుంటుంది. పూర్తి వివరాలకు వ్రాయండి.

చందమామ పబ్లికేషన్సు,
వడపళని, మద్రాసు - 26

మా అభిమాను లందరికి
దీపావళీ శుభసమయాన

అభినందనము లర్పిస్తున్నాము



మేలైన ముద్రణకు

నెల్‌సన్ టైపులనే

ఉపయోగించండి



# నెల్‌సన్ అండ్ కో

## (ది ఫైన్ ఆర్ట్ టైప్ ఫౌండ్రీ)

స్థాపితము: 1916

చూళై :: మదరాసు - 7



"చందమామ" నెల్‌సన్ టైపులతో ముద్రింపబడుతున్నది.


ధైర్యశాలి
రాము,
డంబాల
రంగా


ఓహో రంగా! మళ్లీ
డంబాలు కొట్టు చున్నావు!


డంబాలా? ఎలా ఈదాలో చేపలకు
నేను నేర్పగలను.


నేను
పాతాళానికి
మునుగుతాను!


నీవు కావాలంటే...


నేను దోసెడు మంచి
ముత్యాలను తెచ్చి
యిస్తాను!

DL. 448A-50 TL
















ఎదిగే శరీరాలకు డాల్డా వనస్పతి
కావాలి; అది ఎ.డి.
విటమినులుగల
శక్తి-నిచ్చే బలిష్ఠ
క్రొవ్వు పదార్థము.
మరియు 'డాల్డా'
లో వండబడిన
ఆహారము
యింతో రుచిగా
వుండును! మీ
ఆహార-
మును
'డాల్డా'తో
వండమని మీ అమ్మను
అడగండి.




DL. 448B-50 TL

హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ బొంబాయి.

విశాలాంధ్ర అంతటా
విజయభేరి మ్రోగిస్తున్న



ఆర్.ఆర్. పిక్చర్సు వారి

# కార్తవరాయని కథ

అత్యద్భుత పౌరాణిక జానపదగాథ..

ఆబాలగోపాలం చూచి ఆనందిస్తున్న చిత్రం

డైరెక్షన్... రామన్న

మాటలు
మద్దిపట్ల సూరి

పాటలు
దేవులపల్లి కృష్ణశాస్త్రి

సంయుక్తదర్శకుడు
ఐ.యస్.మూర్తి

విజయ
రిలీజ్



## చందాదారులకు మనవి

★

పైనెల చందమామలు యీనెల చివరి వారంలో పోష్టు అవుతవి. సకాలంలో అందనివారు, వారి పోష్టాఫీసులో ఫిర్యాదుచేస్తూ, పై నెల పదోతేదీ లోగా మాకు తెలియపర్చ గోరుతాము. ఆ పైబడి వచ్చు కంప్లెయింట్లు, గతనెలలో చేరలేదనే కంప్లెయింట్లు గమనించబడవు.

★

చందమామ పబ్లికేషన్సు,
వడపళని, మద్రాసు - 26

# ఆల్వీటోన్ మన అందరకు



"రోజంతా ఆఫీసులో పనిచేసి, అలసి ఇంటికి వస్తే ఒక్క కప్పు ఆల్వీటోన్ పుచ్చుకోవటంతో నాకు కొత్త జవము కలిగి, ఎంతో ఉత్సాహాన్నిచ్చింది."



"ఇప్పుడు నాకు వంటపని, యింటిపని అంటే భయంలేదు. ఒక్క కప్పు ఆల్వీటోన్ పుచ్చుకున్నానంటే నాకు కొత్తశక్తి కల్గుతున్నది. అందులోనూ ఆల్వీటోన్ అంటే నాకు మరీ యిష్టం. ఏమంటే, కుటుంబంలో యావన్మందినీ అది ఆరోగ్యంగా వుంచి ఆనందాన్నిస్తుంది."



చిన్నారి రామూ చదువులోనూ ఆటలోనూకూడా, అందరికీ ఇష్టుడు. అతడికి అంత ఉల్లాసమూ ఆరోగ్యమూ ఇచ్చేది ఆహారపానీయమైన ఆల్వీటోన్.




## ఆల్వీటోన్ కావాలని అడగండి

భారతదేశపు
ప్రియమైన
ఆహారపానీయము

తయారుచేయువారు :
ఆల్వీటోన్ లేబరెటరీస్
మదరాసు - 16.

ఆంధ్రప్రదేశ డిస్ట్రిబ్యూటర్లు—(కడప - అనంతపురం జిల్లాలు మినహా)
స్వతంత్ర ఏజెన్సీస్, గాంధినగర్, విజయవాడ - 2.

త్వరలో విడుదల!






తిరుమలా పిక్చర్సు వారి

# సమాజం



దర్శకుడు: అడ్డాల నారాయణరావు

నిర్మాత: మేర్ల జగన్నాయకులు



స్టూడియో వాహిని

చమ్రియా రిలీజ్

# "విశాలాంధ్ర అంతటా ....

# .... విజయయాత్ర సాగిస్తున్నది"

మూడురకముల-
అత్తగారలు
మూడురకముల-
కోడళ్ళ కథ
మూడురకముల
కొడుకులుంటే
చూడచక్కనిది-




























అత్తయూ ఒక
యింటి కోడలు
అనెడి సూక్తిని
చాటి చెప్పే
చూడముచ్చటు
గొలుపు చిత్రం
నేడు చూడండి!



అనుపమ చిత్రం

# అత్తా ఒకింటి కోడలే!

నిర్మాత • దర్శకుడు, తిలక్ ... పూర్ణా రిలీజ్

FLOODLIGHT

# దంతక్షయమును నివారించుటకు



## ...ఆనందదాయకమైన మార్గము!

దంతక్షయమును నివారించండి! పరిశుద్ధమైన లిస్టరిన్ టూత్ పేస్ట్ వాడితే, పళ్ల కుదుళ్లను ఈ 3 విధములుగా చక్కబరచును:

1. లిస్టరిన్ టూత్ పేస్ట్ విషక్రిములను పారద్రోలును.
2. లిస్టరిన్ టూత్ పేస్ట్ క్రిములను అంటివుంచు పళ్ల గారను తొలగించును.
3. లిస్టరిన్ టూత్ పేస్ట్ నోటినుండి స్రవించు కొన్ని ద్రవములను అరికట్టును.

లిస్టరిన్ టూత్ పేస్ట్‌తో ప్రతి భోజనముతరువాతను బ్రషింగు చేసుకొన్నయెడల దంతక్షయము నివారణమగును, ఇంతకు ముందు లేనంత కాంతితో పళ్లు తెల్లగా మెరిసిపోవును. దాని చక్కటి పరిమళము బిడ్డల కెంతో యిష్టము.

ముఖ్యముగా ఇది బిడ్డలకు అవశ్యకము!

సుప్రసిద్ధ లిస్టరిన్ ఆంటిసెప్టిక్‌ను చేసినవారే దీనినీ తయారుచేశారు.




**Made by the makers of famous LISTERINE ANTISEPTIC**



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

## దీపావళి

మరొక దీపావళి వచ్చింది!

దీపావళి అంటే ఏమిటి?

నిరాశానిస్పృహల అంధకారం తొలగిపోయి ప్రపంచమంతటా ఆశాజ్యోతులు వెలగటం.

కష్టకాలం వెనకబడి సుఖానికి బాట ఏర్పడటం.

దారిద్ర్యం నుంచి, దాస్యం నుంచి ప్రజలు విముక్తి పొందటం.

దుఃఖభాజనమైన ఒక యుగం అంతరించి వికాసంతో, ఆనందోత్సాహాలతో, నూతన చైతన్యంతో తొణికిసలాడే ఒక కొత్త యుగం ప్రారంభం కావటానికి చిహ్నం దీపావళి.

ఆచారం ప్రకారం అందరమూ ఏటా దీపావళి చేసుకుంటున్నాం. కాని ప్రపంచానికంతకూ ఇంకా దీపావళి రాలేదు.

కాని రాబోతోంది! ఆనాడు ప్రపంచప్రజలు యుద్ధభయంనుంచీ, నిరాశానిస్పృహలనుంచీ, దాస్యంనుంచీ, దారిద్ర్యంనుంచీ విముక్తిపొంది భవిష్యత్తును తేజోమయంగా, ఆనందమయంగా చూడగలుగుతారు!

సంపుటి 23 ★ నవంబర్ 1958 ★ సంచిక 5





# కాకోలూకీయం

కానలో సింహ మొ-క్కటి ఒకమారు
తానెంత తిరిగి కొం-తయు తిండి లేమి
గవి నొక్కటిని జూచి - కడు డస్సి లోన
నవయుచు బడుకొనె - నంతలో నచట
నివసించు నక్క పె-న్నిద్దుర వచ్చి
ఇవి యేమి అడుగులం - చెంతొ యోచించె.
లోనికి పోయి అ-లో అనుకంటె
లోన యేమున్నదో - కానగావలయు
అని "గవీగవి" యని - అది పిల్వసాగె
విను పల్కితే గాని - నిను దూరననియె.
అది విని సింహ మా-హా చిక్కె నక్క
ఇది పల్కునో యేమొ - ఇపు డూరకుండె
అని గవి బదులుగా - అఱతు నటంచు
పని కట్టుకొని ఓహొ - యుం చని పల్కె
సింహ గర్జను విని - చెడితి నటంచు
సింహ భీతిని నక్క - చెదరి పారినది.

*      *      *

అని చెప్పి రక్తాక్షు - డా గవి విడిచి
తన వారితో చేరి - తరలె నెక్కడికొ.
ఇది మేలని తలంచి-యే స్థిరజీవి
ఎద నెంచి మెల్లగ - నెండు పుల్లలను
గూడు కట్టుటకని - గుహముందు తెచ్చి
గోడగా నిల్పి త-క్కొరు గానకుండ.
పగటి చీకటి కండ్ల - పక్షులు గూబ
లొగి పడుకొనియుండ - నొక్కటే యేగె.
తన కాకరాజును - దర్శించి చెప్పె
"విను రాజ శత్రుల - విడిది చూపింతు
ఎండు పుల్లల నేరి - యుండితి నచట
మెండుగా నొక కొర్వి - మీరు చేకొనుడు"
అనినంత కాక రా - జాశ్చర్యమంది
వినిపింపు మెటు శత్రు-లను చేరి తనియె.
తరువాత నవి యెల్ల - తడయుగరాదు
కొఱవి అందుంచిన - కూలునా గుంపు.
అని స్థిరజీవి యా-తని పురికొల్పె

విద్వాన్ విశ్వం



చనె కాకులెల్ల కొ-ర్విని గొనె రాజు
కొఱవి నా గుహలోని - గుట్టపుల్లలను
త్వరలోన వేసిన - ధగధగ మండి
పగలు కన్నులు కనం-బడని గూబలకు
భగభగ మంటలో - ప్రాణాలు పోయె.
వైరుల నిటు చంపి - వాయసా లెల్ల
తాము ముందున్న ఆ - తరువునే చేరె.
పేరోలగంబుండి - పెను కాకరాజు
తీరుగా నిట్లనె - స్థిరజీవితోడ.

మేఘవర్ణుడనే కాకరాజు :

స్థిరజీవి నీ వెట్లు - చేరితి పగఱ
అరులలో బ్రదుకుట - అతి కష్టమయ్యె

స్థిరజీవి :

అసిధారపై నుంట - అరులలో నుంట
పసిగల వానికి - సాధ్యమే యగును
యజమానికై బాధ - లవి యివి యైన
సుజనుడు తల యొగ్గు - చోద్యమా అదియు?
తలదాల్చి శత్రుల - తరుణమ్ము కొఱకు
అల త్రాచుపాము సే-యగలేదె మున్ను

మేఘవర్ణుడు :

ఏమిటా కథ? త్రాచు - ఏమేమి చేసె?
మీ మాటలన్ విన - మిన్నెక్కు నాస.

స్థిరజీవి :

మును త్రాచుపామొక్క - మునిపోల్కి యయ్యె



తన బలమెల్లను - తగ్గెను ముదిమి
తినుటకు గూడనే-దియు చిక్కదయ్యె
అనుకొనె నప్పు డ-య్యది దిక్కులేక
"వైరుల బల్మిని బట్టగా లేను
వారల యుక్తితో - బంధింపవలయు
మెల్లన కోనేటి - మెట్టికలపైన
తెల్లని పరుపట్లు - తిరుగుచు నిలిచె.
తినదు చూడదు భక్తి - కను లెత్తబోదు
అని కప్పలెల్ల దా-నిని నమ్మినారు.
ఒక కప్ప అడిగె "ఏ-టికి తపమయ్య?
సుకముగా నుండక - శుష్కింపనేల?"
అన్న బ్రాచనె, మును - నన్నొక ద్విజుడు
కన్ను గానక కొడు-కును కాటువేయ
శపియించె "కప్పల - చక్కగా మోసి
తపియింతువని" ఇటు - తడవాడుచుంటి
అన నిజమనుకొని - ఆ కప్ప లెల్ల
మునుకొని దానిపై - మూల్గి కూర్చుండ
అటునిటు దిరుగుచు - నా కప్పరాజు
గుటకల మింగుచు - కూర్మితో నుండె.

కడ కొక్కనాడేమొ - కప్పల రాజు
బడబడ పాముపై - నడయాడి వచ్చి
ఇంత చిక్కితి వేమి - ఎందుల కన్న
చింతకాదిది తిండి - చిక్కలేదనియె.
సరి చిన్నకప్పల - సాదమ్ము గొనుము
వెఱపేల ననె రాజు - సరె అనె పాము.
ఇక చూచుకో కప్ప - లొక్కటొక్కటియె
టకటక పాము త-క్కక తినివేసె.
కాన దేవా శత్రు-గణములో నెట్లొ
పూనిక చేరియే - పోవలెగాని
వెనుకాడజనదు ఏ-విధమైన గాని,
చనవున గాని ఏ-చాయనే గాని
వైరుల వేళ్ళతో - వధియింపవలయు
దారి చిక్కనినాడు - తగ్గిపోవలయు.
తఱి చూచి దెబ్బతో - తరలించవలయు
మఱి అట్లె చేసితి - మన శత్రువులను.

* * *

అని స్థిరజీవి చె-ప్పిన కాకరాజు
తని వంది పొగడి అ-క్కున జేర్చుకొనియె.

★ కాకోలూకీయం సమాప్తం ★





# నజరుద్దీన్ అవంతీ

చైనాలో నజరుద్దీన్ అవంతీ అనే హాస్యగాడుండేవాడు. ఇతనిని గురించి చాలా హాస్య కథలు చెబుతారు.

ఒకనాటి రాత్రి అవంతీ శ్మశానంమీదుగా వెళుతున్నాడట. అతని వెనకగా కొందరు గుర్రాలెక్కి సవారీ చేస్తూ వచ్చారు. వాళ్లు దొంగలై ఉంటారని అనుమానం కలిగి అవంతీ ఒక సమాధిలో దూరి దాక్కున్నాడు. ఆశ్వికులు అతను దాక్కోవటం చూసి వారు కూడా అతన్ని అనుమానించారు. అందుచేత వారు అతన్ని సమీపించి, "ఎవరు నువు ?" అని అరిచారు.

అవంతీ సమాధిలోనుంచి తల బయటికి పెట్టి, "నేను చచ్చిపోయినవాణ్ణి, నన్ని సమాధి కింద పాతిపెట్టారు," అన్నాడు.

"ఈ అపరాత్రివేళ చచ్చిపోయినవాడు పైకి రావలసిన పనేమిటో ?" అన్నారు ఆశ్వికులు.

"చల్లగాలికోసం వచ్చాను," అన్నాడు అవంతీ. "చచ్చినవాళ్లకూ కూడా చల్లగాలి అవసరమా ?" అన్నారు వాళ్లు.

"అవసరం లేదు... నేనే పొరపడ్డాను !" అంటూ అవంతీ సమాధిలోకి దూరాడు.

ఇంకొక రోజు అవంతీ ఇంట ఒక దొంగ పడ్డాడు. అవంతీ దొంగను చూసి సందుగాయి పెట్టెలో దాక్కున్నాడు. దొంగ ఇల్లంతా వెతికి, ఏమీ దొరక్క, సందుగాయి పెట్టె మూత ఎత్తి అవంతీని చూసి, "ఓహో, నువ్విక్కడ ఉన్నావా ?" అన్నాడు.

"నీకు కావలిసిన దేదీ మా యింటో దొరకదని సిగ్గేసి ఇందులో దాక్కున్నాను," అన్నాడు అవంతీ.

మరొకసారి అవంతీ ఇంట దొంగలు పడి ఇంటో ఉన్న సామానంతా మోసుకు పోసాగారు. ఒకటి రెండు చిల్లరసామాన్లతో అవంతీ వారి వెనకనే బయలుదేరాడు.

ఎం. ఎల్. నరసింహారావు






దొంగలలో ఒకడు వెనక్కు తిరిగి చూసి, "ఓహో, అవంతీ? అర్ధరాత్రివేళ ఎక్కడికో ప్రయాణమయావే?" అని అడిగాడు.

"ఏం లేదు. చాలా రోజులుగా ఇల్లు మారదామనుకుంటూ, బండిఖర్చుకు లేక బద్ధకించాను. ఇవాళ మీధర్మాన ఇల్లు మారే అవకాశం దొరికింది," అన్నాడు అవంతీ.

"నీకు సూర్యుడంటే ఇష్టమా లేక చంద్రుడంటేనా?" అని అవంతీని ఒక మిత్రుడు అడిగాడు.

"చందమామే," అన్నాడు అవంతీ.

"అదేం?" అన్నాడు మిత్రుడు.

"చూడు, పట్టపగలు మనకు బోలెడంత వెలుతురున్నప్పుడు సూర్యుడు వస్తాడు. చందమామ చక్కగా చీకటప్పుడు వచ్చి వెలుతురిస్తాడు," అన్నాడు అవంతీ.

"ప్రపంచంలో ఉన్న నీరంతా నిప్పంటుకుని మండటం మొదలుపెడితే చేపలన్నీ ఏమవుతాయంటావు?" అని ఎవరో అవంతీని అడిగారు. "అంతపనే జరిగితే చేపలన్నీ చెట్లెక్కిపోవూ?" అన్నాడు అవంతీ.

"తెల్లవారగానే మనుషులంతా లేచి అన్నివైపులా పోతారుగదా, దీనికి కారణమేమిటి?" అని అవంతీని కొందరు మిత్రులు అడిగారు. "అయ్యో పిచ్చిమొహాల్లారా, ఇదికూడా తెలీదా? మనుషులందరూ ఒకే వేపు పోతే భూమి అటు ఒరిగిపోదూ?" అన్నాడు అవంతీ.

"శవాన్ని సాగనంపేటప్పుడు శవపేటికకు ముందుండటం మంచిదా, వెనక ఉండటం మంచిదా?" అని ఎవరో అవంతీని అడిగారు. "ఏదైనా మంచిదే; శవపేటిక లోపల ఉండకుండా ఉంటే చాలు," అన్నాడు అవంతీ.

ఒకనాడు అవంతీకి దారి తప్పిన గొర్రె ఒకటి దొరికింది. అతను దాన్ని ఇంటికి తీసుకుపోయి కోసుకుతిన్నాడు. ఈ సంగతి తెలిసి ఒక మిత్రుడు, "అవంతీ, ఈ పాపం చేసినందుకు భగవంతుడి ఎదట ఏమి



సంజాయిషీ చెబుతావు?" అని అడిగాడు. "నేను గొర్రెను తినలేదని చెబుతాను," అన్నాడు అవంతీ.

"గొర్రె నీకు విరుద్ధంగా సాక్ష్యం చెప్పటానికి వస్తే?" అన్నాడు మిత్రుడు.

"గొర్రె వస్తే ఇక చిక్కేలేదు! దాన్ని తీసుకుపోయి దాని యజమానికి తిరిగి ఇచ్చేస్తాను!" అన్నాడు అవంతీ.

ఒకనాడు అవంతీకి డబ్బు కావలిసి వచ్చింది. బరువులు మోసి డబ్బు సంపాదించే ఉద్దేశంతో అవంతీ కట్టుతాళ్లు తీసుకుని బజారుకు వెళ్లాడు. అక్కడ ఒక పెద్దమనిషి కొంత పింగాణిసామాను ఒక కొయ్యపెట్టెలో పెట్టుకుని కూలివాడికోసం చూస్తూ కనిపించాడు. ఆయన కూలిడబ్బులకు బదులు మూడు సలహా లిస్తాననటంవల్ల ఒక్క కూలివాడూ పలకలేదు.

"డబ్బు ఎప్పుడన్నా సంపాదించవచ్చు. మంచి సలహాలు అన్నప్పుడల్లా దొరకవు," అనుకుని అవంతీ ఆ పింగాణీసామాన్ల పెట్టెను తాను మొయ్యటానికి ఒప్పుకున్నాడు. ఇద్దరూ కలిసి ఆ పెద్దమనిషి ఇంటికి వెళ్ళే దారిలో అవంతీ, "మీరు చెప్పే మంచి సలహాలేమిటో సెలవిస్తారా?" అన్నాడు.

"తిండి తినటంకంటె పస్తుండటం మేలని ఎవరన్నా అంటే నమ్మకు," అన్నాడు పెద్దమనిషి. "బాగానే ఉన్నది!" అనుకున్నాడు అవంతీ.

కొంచెందూరం వెళ్లాక పెద్దమనిషి, "సవారీ చెయ్యటంకంటె కాలినడక మెరుగని ఎవరన్నా అంటే నమ్మకు," అన్నాడు.

మరి కొంచెందూరం వెళ్లాక పెద్దమనిషి, "నీకన్న మూఢుడైన కూలివాడున్నాడని ఎవరన్నా అంటే నమ్మకు!" అన్నాడు.

వెంటనే అవంతీ తన నెత్తిమీది పెట్టెను విసిరి కింద కొట్టి, "ఈ పెట్టెలో ఉండే పింగాణీసరుకు పగిలిపోలేదని ఎవరన్నా అంటే నమ్మకు," అని వెళ్లిపోయాడు.






## 5

[తనను వెంటతరుముతున్న శత్రుసైనికులనుంచి తప్పించుకుని సుబాహుడు, రాజప్రాసాదం చేరి చంద్రవర్మతో శత్రువులు మాయోపాయం చేసి పట్టణంలో ప్రవేశించిన సంగతి చెప్పాడు. తరవాత చంద్రవర్మ తన సేనాని వీరమల్లుడితో కలిసి పట్టణంలో జొరబడి చాలామంది శత్రువులను హతమార్చాడు. కాని, యింతలో సర్పకేతుడు కొత్త సైన్యంతో వచ్చిన వార్త తెలిసింది. చంద్రవర్మ తన భటులనందరినీ వెంటబెట్టుకుని ప్రాసాద దుర్గరక్షణకు వెళ్లాడు. అసరికే శత్రువులు దాన్ని చుట్టుముట్టి తలుపులు బద్దలు కొడుతున్నారు. చంద్రవర్మ తన సైనికులతో హఠాత్తుగా వాళ్లను ఎదుర్కొన్నాడు. తరవాత—]

చంద్రవర్మ భటులకూ, సర్పకేతుడి సైనికులకూ దుర్గముఖద్వారంవద్ద భీషణ పోరాటం జరిగింది. సంఖ్యలో నాలుగైదింతలున్న సర్పకేతుడి సైనికులు ప్రారంభంలో చంద్రవర్మ భటుల ధాటికి తట్టుకోలేక కొంత వెనుకకు తగ్గారు. కాని, కొద్దిసేపటిలోనే, వాళ్లకు చంద్రవర్మ భటులు స్వల్పసంఖ్యాకులని తెలిసి, ధైర్యం తెచ్చుకుని తెగించి పోరాడసాగారు.

ఈ విధంగా కొంతసేపు సంకుల సమరం సాగింది. తను ఎంత ప్రయత్నించినా దుర్గద్వారాలను చేరుకోలేకపోవటంతో చంద్రవర్మ ఏమి చేయటమా అని ఆలోచించేంతలో, దూరంగా మరొక అశ్వికదళం వస్తున్న



సూచనగా పెద్ద ధ్వని వినబడింది. ఆ వెంటనే సుబాహుడు తన గుర్రాన్ని చంద్రవర్మ పక్కకు నడిపి, "యువరాజా! మనం పెద్ద చిక్కులో పడబోతున్నాం. మనను వెనుకనుంచి ఎదుర్కొనేందుకు సర్పకేతుడు కొత్త ఆశ్వికులను రంగంలోకి దింపుతున్నాడు," అన్నాడు.

అప్పటి పరిస్థితుల్లో తను దుర్గంలోకి జొరబడగలగటం సాధ్యమయే పని కాదని నిర్ణయించుకున్నాడు చంద్రవర్మ. రెండు శత్రుసైన్యాలమధ్య చిక్కుకుపోకుండా బయటపడటమే తక్షణ కర్తవ్యంగా అతడికి తోచింది. సేనాని ధీరమల్లుడుకూడా రానున్న విషమపరిస్థితిని అర్థం చేసుకున్నాడు. సైనికులు చేసే రణగొణధ్వనిలో అతడు పెద్దగా ఎలుగెత్తి, "యువరాజా! మీరు యిక్కణ్ణించి త్వరగా బయటపడటం మంచిది. నేను, నా భటులతో మీకు మార్గం కల్పిస్తాను," అన్నాడు.

చంద్రవర్మకు ఆలోచించేందుకూడా వ్యవధి లేదు. శత్రువుల ఆశ్వికదళం వెనుకనుంచి త్వరత్వరగా చేరువ అవుతున్నది. అతడు గుర్రాన్ని దుర్గద్వారాలనుంచి వెనుకకు తిప్పుతూ, "సుబాహూ!" అని పెద్దగా కేకవేసి తన కత్తితో శత్రుసైనికుల మధ్యగా దారి నరుక్కుంటూ తిరోగమించసాగాడు. సుబాహుడుకూడా తన యజమాని వెనకనే తన గుర్రాన్ని పరిగెత్తించాడు.

చంద్రవర్మా, సుబాహుడూ శత్రుసైనికుల మధ్యనుంచి బయటపడి పారిపోతున్నంతలో, అది గ్రహించిన శత్రుఆశ్వికులు కొందరు వాళ్లను వెంబడించేందుకు ప్రయత్నించారు. కాని, సేనాని ధీరమల్లుడు వారి మార్గాన్ని అటకాయించాడు. యీ అదనులో చంద్రవర్మా, సుబాహుడూ యుద్ధరంగానికి దూరంగా పారిపోసాగారు.

వాళ్లిద్దరూ ఆ విధంగా కొంతదూరం రాజమార్గంవెంట వెళ్ళి, తరవాత తమ గుర్రా






లను నగరదక్షిణద్వారంకేసి తిప్పారు. నగరంలోనుంచి బయటపడాలంటే, బహుశా తమకు ఆ దక్షిణద్వారం ఒక్కటే శరణ్యమని చంద్రవర్మ నిశ్చయించుకున్నాడు తక్కిన ద్వారాలన్నీ శత్రువుల అధీనంలో వున్నట్టు అతడికి తెలుసు.

చంద్రవర్మా, సుబాహుడూ దక్షిణద్వారం అల్లంత దూరంలో వున్నదనగా తమ గుర్రాలను ఆపి, ద్వారందగ్గిర శత్రుసైనికులకోసం పరీక్షించి చూశారు. అక్కడ పెద్ద శత్రుసైన్యం వున్న సూచనలు లేవు. కొందరు జనులు ఆ ద్వారంవెంట బయటికి పోతున్నారు. అయిదారుగురు శత్రుసైనికులు ద్వారానికి ఒక పక్కగా నిలబడి సంభాషించుకుంటున్నారు. వారి గుర్రాలు అంత దూరంలో మేకులకు కట్టివేయబడి వున్నవి.

"యువరాజా! సేనానిధీరమల్లుడు యింకా శత్రుసైనికులను మనను వెంబడించకుండా నిలువరిస్తూ వుండాలి. అయినా, అతడికి సహాయంగా వున్న కొద్దిమంది భటులతో అతడు యింకెంతో సేపు శత్రువులు మనను వెంబడించకుండా ఆపలేడు. కనుక, మనం త్వరగా నగరంనుంచి బయటపడటం మంచిది. ఒక్క దూకున ద్వారం దాటి పోదాం," అన్నాడు.

చంద్రవర్మ అవునన్నట్టు తలవూపి, గుర్రాన్ని గట్టిగా అదిలించాడు. అదే సమయంలో ద్వారంవద్ద మంతనాలాడుతున్న శత్రుసైనికుల దృష్టి వాళ్లమీదికి ప్రసరించింది. వాళ్లు ఉలిక్కిపడి అంతలోనే ఒరనుంచి కత్తులు దూసి, "హేయ్," అంటూ తమ గుర్రాలకేసి పరిగెత్తబోయారు.

"సుబాహూ! మనం వెంటనే ద్వారం దాటి పోవాలి. గుర్రాన్ని ఆపకుండా పరిగెత్తిస్తూనే, నీ కత్తివేటుకు దొరికితేమాత్రం యీ శత్రుసైనికులను తెగటార్చు," అంటూ చంద్రవర్మ తన గుర్రాన్ని ద్వారంకేసి వురికించాడు.





శత్రుసైనికులలో ముగ్గురు యీలోపల తమ గుర్రాలను చేరి, వాటిని మేకులనుంచి విప్పుతున్నారు. ఇరువురు సైనికులుమాత్రం దారికి అడ్డుగా నిలబడి. "ఆగండి! ప్రాణాలు దక్కవు," అంటూ కత్తులు దూశారు.

"ప్రాణాలు దక్కనిది ఎవరికి?" అంటూనే సుబాహుడు వేగంగా పరిగెత్తుతున్న తన గుర్రంమీదినుంచి ఒక పక్కకు ఒరిగి కత్తితో ఒక సైనికుడి తలను మొండెంనుంచి వేరుచేశాడు. రెండవ సైనికుడిపై చంద్రవర్మ కత్తి విసిరేంతలో ఆ సైనికుడు ప్రమాదాన్ని గ్రహించి చటుక్కున భూమిమీదికి బోర్లా పడిపోయాడు.



ఈలోపల శత్రుసైనికులు తమ గుర్రాలను ఎక్కి, చంద్రవర్మా, సుబాహులవెంటబడ్డారు. చంద్రవర్మ వెనుదిరిగి చూడకుండా ద్వారాన్నుంచి తన గుర్రాన్ని వేగంగా బయటికి దూకించి సూటిగా వున్న బాటవెంట పరిగెత్తించసాగాడు.

ముందు చంద్రవర్మా, కొంచెం వెనకగా సుబాహుడూ తమ గుర్రాలను మహావేగంగా పరిగెత్తిస్తున్నారు. వారికి కొంచెం దూరంలో నలుగురు శత్రుఅశ్వికులు రణగొణధ్వని చేస్తూ వస్తున్నారు.

"యువరాజా! మనం ఆగి, యీ శత్రువుల అంతు తేల్చుకోవటం మంచిదేమో! వీళ్లు మనను వదిలేలా లేరు," అన్నాడు సుబాహుడు.

"మనం ఆగటం మహా ప్రమాదం. యీపాటికి మనం నగరంనుంచి పారిపోయిన సంగతి సర్పకేతుడివరకూ వెళ్ళివుంటుంది. అతడు తప్పక మనను వేటాడేందుకు పెద్ద బలగంతో బయలుదేరుతాడు. ఈ శత్రుసైనికులను యింకా వెంబడించనీ, ఆ కనబడే కొండ సానువులు చేరగానే, వాళ్ల పని పట్టుదాం," అన్నాడు చంద్రవర్మ.

చంద్రవర్మ మాట ముగించీ ముగించకముందే రివ్వుమంటూ ఒకబాణం అతడి





కుడిభుజాన్ని రాసుకుంటూ పోయి, బాటకు ఒకపక్కగా భూమిలో గుచ్చుకుపోయింది. "సుబాహూ!" అంటూ చంద్రవర్మ పెద్దగా అరిచి గుర్రంమీద ముందుకు వాలి దాని మెడమీదుగా కరుచుకు పడుకున్నాడు.

"ఇప్పటివరకూ నేను బతికే వున్నాను, యువరాజా!" అంటూ సుబాహుడుకూడా గుర్రం జూలుమీదికి వంగి తల వెనక్కు తిప్పి చూశాడు. శత్రు అశ్వికులలో ఒకడు విల్లంబు రెండుచేతులతో పట్టుకుని గురి చూస్తున్నాడు. గుర్రం కళ్లెపుతాళ్లను అతడు పళ్లమధ్య గట్టిగా బిగించిపట్టుకున్నాడు. యీ దృశ్యం సుబాహుడికి ఆశ్చర్యాన్నీ, భయాన్నీ కూడా కలిగించింది. కాని, అతడు చంద్ర వర్మకు యీ సంగతి చెప్పబోయేంతలో ఆ అశ్వికుడి గుర్రం కాలు బాటలో వున్న ఒక రాతిముక్కకు తగిలి ఒక్క తృటికాలం అది ఒక పక్కకు ఒరిగింది. అదే క్షణంలో వెనుక వేగంగా వస్తున్న గుర్రాలలో ఒకటి దాన్ని బలంగా తాకింది. బాణం విల్లూ పట్టివున్న సైనికుడు ఆ తాకిడికి గుర్రంమీది నుంచి నాలుగైదడుగుల ఎత్తున గాలిలోకి లేచి పెద్దగా అరుస్తూ కింద పడిపోయాడు. అతణ్ణి నలగతొక్కుకుంటూ తక్కిన గుర్రాలు ముందుకు దూకినై.

సుబాహుడు ఆనందంతో ఎగిరి గుర్రం మీద నిఠారుగా కూర్చున్నాడు. ఈ దెబ్బతో తక్కిన అశ్వికులు తమను వెంట తరమటం మాని, తమతోటి వాడికి సహాయం చేసేందుకు ఆగుతారని అతడు అనుకున్నాడు. కాని, అతడి ఆశ నిరాశ అయింది. శత్రు అశ్వికులు తమవాడికోసం వెనుదిరిగైనా చూడకుండా గుర్రాలను వేగంగా పరిగెత్తిస్తున్నారు. కాని, వాళ్ళల్లో విల్లంబులు పట్టినవాడెవడూ లేడన్న సంగతి సుబాహుడికి ఎంతో ఉత్సాహాన్ని కలిగించింది.

"యువరాజా! శత్రుఅశ్వికుల్లో బాణాలు వదిలేవాడు, వాడి అనుచరుల గుర్రం గిట్టల



కింద నలిగి చచ్చాడు. ఇప్పుడు మనను వెంబడించి వస్తున్నవాళ్ళు ముగ్గురు. వాళ్ల దగ్గిర వున్న ఆయుధాలు కత్తులుమాత్రమే. ఆగి, వాళ్ళను యమపురికి పంపుదామా ?" అన్నాడు సుబాహుడు.

చంద్రవర్మ వెనుదిరిగి చూశాడు. శత్రు అశ్వికులు ముగ్గురు. వాళ్ళను తుదముట్టించటం ఏమంత కష్టం కాదు. కాని, యీలోపల మరికొందరు శత్రువులు అక్కడికి రావటం జరిగితే తమ పరిస్థితి ప్రమాదకరంగా పరిణమిస్తుంది. అతడు యీ విధంగా ఆలోచిస్తూ, తన గుర్రం వేగాన్ని తగ్గించి, బాటకు ఒక పక్కగా దాన్ని నిలి



పాడు. ఇంతలో సుబాహుడుకూడా అక్కడికి వచ్చి తన గుర్రాన్నికూడా నిలువరించాడు. ఆ వెంటనే శత్రు అశ్వికులు గుర్రాలను ఆపి, చంద్రవర్మా, సుబాహుల కేసి చూస్తూ ఏదో మాట్లాడుకోసాగారు.

"యువరాజా ! ఈ దుర్మార్గులు మనతో కలియబడటానికి భయపడుతున్నట్టున్నది. వాళ్ళు ధైర్యంచేసి యిక ముందుకు రారు. మనమే వెళ్ళి వాళ్ల పని పట్టిద్దాం ?" అన్నాడు సుబాహుడు.

చంద్రవర్మ శత్రుఅశ్వికులకేసి ఓ క్షణ కాలం చూసి, "సరే, సుబాహూ ! మనం వీళ్ళను త్వరగా పరలోకయాత్రకు ప్రయాణం కట్టించాలి. ఆలస్యం అయితే, మరికొందరు శత్రువులు యిక్కడికి రావొచ్చు," అంటూ గుర్రాన్ని శత్రుఅశ్వికుల కేసి నడపసాగాడు.

చంద్రవర్మా, సుబాహుడూ తమకేసి రావటం చూస్తూనే, శత్రుఅశ్వికులు ముగ్గురూ తమ గుర్రాలను గిరుక్కున వెనక్కు తిప్పి, నగరంకేసి పోనివ్వసాగారు. చంద్రవర్మ తన గుర్రాన్ని డొక్కల్లో గట్టిగా పొడిచి వేగంగా ముందుకు దూకించాడు. కాని, శత్రుఅశ్వికులుకూడా తమ గుర్రాలను గట్టిగా అదిలించి పారిపోసాగారు.





శత్రువులను తరుముకుంటూ చంద్ర వర్మా, సుబాహుడూ దాదాపు ఒక కోసెడు దూరం నగరంకేసి వెళ్ళారు. హఠాత్తుగా వారికి నగరంవైపునుంచి వస్తున్న కొందరు రౌతులు కనిపించారు. చంద్రవర్మ వాళ్లను చూస్తూనే తన గుర్రాన్ని ఆపి వెనక్కు తిప్పుతూ, "సుబాహూ! శత్రువుల ఎత్తుగడ అర్థమైందిగదా? ఇక మనం పారిపోవటమే ఉత్తమం. మనం, యీ ముగ్గురినీ అందు కునే లోపల ఆ శత్రుపటాలం అంతా వచ్చి మనను చుట్టుముట్టుతుంది," అన్నాడు.



చంద్రవర్మా, సుబాహులు తమ గుర్రాలను వెనక్కు తిప్పి పరిగెత్తించే లోపల శత్రుఅశ్వికులు ముగ్గురుకూడా తమతమ గుర్రాలను మళ్ళించి వాళ్లవెంట పడ్డారు. క్రమక్రమంగా శత్రుఅశ్వికులకూ, చంద్ర వర్మా సుబాహులకూ మధ్య వున్న దూరం తగ్గుతున్నది.

"యువరాజా, మనం యీసారి నిజంగా ప్రమాదంలో చిక్కుకున్నాం," అన్నాడు సుబాహుడు పెద్దగా ఆయాసపడుతూ.

చంద్రవర్మ జవాబివ్వలేదు. తనను అనుసరించి రమ్మన్న సూచనగా అతడు సుబాహుడికేసి చేయిమాత్రం వూపాడు. పారిపోతున్నవాళ్లూ, తరుముకువస్తున్న వాళ్లూకూడా తాము ఎలాంటి మార్గాన వస్తున్నదీ గమనించటం లేదు. చూస్తూ వుండగానే వాళ్ళు బాటకు యిరువైపులా వున్న పొదలూ, గుట్టలూ దాటి ఒక కొండ దారిన బడ్డారు.

చంద్రవర్మా, సుబాహుడూ ఎక్కిన గుర్రాలు బాగా డస్సిపోయినై. అవి యింకెంతసేపో తమను మోయులేవని చంద్ర వర్మ గ్రహించాడు. అతడి దృష్టి శత్రు అశ్వికులకేసి మళ్లింది. వాళ్ళు ఎక్కిన గుర్రాలుకూడా రొప్పుతూ, నోటివెంట నురుగులు కక్కుతున్నవి. అతడి దృష్టి కొండకు దిగువగా ప్రసరించింది. దాదాపు బాణం



వేటు దూరంలో పదీ పన్నెండుమంది శత్రు అశ్వికులు తమకేసే వస్తున్నారు.

"సుబాహూ, యిక మనం ఈ గుర్రాలను నమ్ముకుని లాభంలేదు. అవి ఏ క్షణానయినా ప్రాణాలు వదలవచ్చు. మనం పాదచారులుగా పారిపోవటమే మంచిది," అంటూ చంద్రవర్మ గుర్రంమీదినుంచి దిగాడు. అతడి వెంటనే సుబాహుడుకూడా గుర్రం దిగాడు. అదే క్షణంలో శత్రుసైనికులు పెద్దగా కేకలుపెడుతూ తమ తమ గుర్రాలనుంచి దిగి, చంద్రవర్మా సుబాహుల కేసి పరిగెత్తి రాసాగారు.

చంద్రవర్మ తనచుట్టూ ఒకసారి కలయచూచి, కొండమీద ఏటవాలుగా వున్న ఒక ప్రదేశంకేసి పరిగెత్తి, అక్కడ వున్న రాళ్లనూ, చిన్న చిన్న అడవిమొక్కలనూ పట్టుకుంటూ కిందికి దిగసాగాడు. సుబాహుడుకూడా అతణ్ణి అనుసరించాడు. యిద్దరూ కలిసి అగాధంగా వున్న దిగువప్రాంతంకేసి జాగ్రత్తగా పోతున్నంతలో, ఏటవాలుగా వున్న ప్రదేశంమీదికి పదీ పన్నెండుమంది శత్రుసైనికులు వచ్చారు.

వాళ్లల్లో ఒకడు పెద్దగా గొంతెత్తి, "మనం వాళ్ళను అనుసరించి పోవటం ప్రమాదకరం. పట్టు తప్పితే కింద అగాధంలో వున్న నదిలో పడిపోతాం. యిక్కడే వుండి వాళ్ళమీదకు రాళ్ళు దొర్లించండి," అని అరిచాడు. ఆ వెంటనే పెద్ద పెద్ద బండరాళ్ళు చంద్రవర్మా సుబాహులకేసి దొర్లిరాసాగినై.

ఆసరికి చంద్రవర్మా, సుబాహుడూ అగాధం అంచుకు చేరారు. చంద్రవర్మ ఒక్కసారి పైనున్న శత్రుసైనికులకేసి చూసి, "సుబాహూ, యిక మనకు మార్గాంతరం లేదు. నీకు యీత వచ్చును గదా...." అంటూ అగాధం అంచున పొంగులువారుతూ పారుతున్న నదిలోకి చెంగున దూకాడు. —(ఇంకా వుంది)





# అదృష్ట దురదృష్టాలు

ఈజిప్టు దేశానికి ఖలీఫాగా ఉండిన మహమ్మద్ ఇబన్ తైలూన్ చాలా సజ్జనుడు. ఆయన సింహాసనం ఎక్కుతూనే తన తండ్రి చేసిన అక్రమాలను సరిదిద్ది అరాజకాన్ని తొలగించాడు. తన తండ్రి ప్రజలను హింసించి కూడబెట్టిన ద్రవ్యంతో ఆయన కవులనూ, వీరులనూ పోషించి, పేదసాదలకు సహాయపడ్డాడు. అందుచేత ఆయన పరిపాలనలో దేశం సుభిక్షమయింది.

ఒకనాడు ఖలీఫా మహమ్మద్ తన పరివారంలో ఎవరెవరికి జీతాలు ఎక్కువగానూ, పని తక్కువగానూ ఉన్నదో, ఎవరెవరికి పని తక్కువగానూ జీతాలు ఎక్కువగానూ ఉన్నదో విచారించి జీతాలు తక్కువగా ఉన్నవారికి జీతాలూ, పని తక్కువగా ఉన్నవారికి పనీ హెచ్చించాడు. అందరి విషయమూ విచారించినాక ఒక వృద్ధుడు మాత్రం మిగిలాడు. "తాతా, నా పరివారంలో నువు చేసే పని ఏమిటి? నీ జీతమెంత?" అని ఖలీఫా అడిగాడు.

"కీర్తిశేషులైన మీ తండ్రిగారు ఒక చిన్న పెట్టె ఇచ్చి దాన్ని కాపాడమన్నారు. అంతకు మించి నేను చేస్తున్న పని ఏమీ లేదు. అందుకుగాను నాకు నెలకు పది బంగారు దీనారా లిస్తున్నారు," అన్నాడు వృద్ధుడు.

"ఆ కాస్త పనికి అంత జీతమా? ఆ పెట్టెలో ఏమున్నది?" అని ఖలీఫా ఆశ్చర్యంగా అడిగాడు.

"దాన్ని నలభై ఏళ్లుగా కాపాడుతున్నాను గాని అందులో ఏమున్నదీ నాకు తెలియదు," అన్నాడు వృద్ధుడు.

ఖలీఫా ఆ పెట్టెను తెప్పించి చూశాడు. అది బంగారపు పెట్టె. దాన్ని తెరిచి చూడగా అందులో ఏదో ఎర్రని పొడీ, తోలుపై రాసిన

పి. రామకోటేశ్వరరావు





ఒక శాసనమూ కనిపించాయి. అయితే ఆ శాసనం ఏ భాషలో రాసి ఉన్నదో, దానికి అర్థమేమిటో దర్బారులో ఒక్కరికీ బోధ పడలేదు. ఖలీఫా దాన్నిగురించి ఆరా తీయగా ఆ పెట్టె హసన్ అబ్దుల్లా అనేవాడి దనీ, అతన్ని ఖలీఫా తండ్రి ఖైదుచేశాడనీ తెలియవచ్చింది.

హసన్ అబ్దుల్లా ఇంకా జీవించి ఉన్న పక్షంలో వెంటనే విడిపించి తీసుకు రమ్మని ఖలీఫా ఉత్తరువిచ్చాడు. నలభై ఏళ్లు ఖైదు అనుభవించి ముసలివాడైన హసన్ అబ్దుల్లాను ఖైదులోనుంచి బయటికి తెచ్చి, ఆయనకు బట్టలు పెట్టి సత్కరించి ఖలీఫా ఎదటికి తెచ్చారు. ఖలీఫా బంగారుపెట్టెను ఆయనకిస్తూ, "ఇది మీ సొత్తని తెలిసింది. మీరే తీసుకోండి," అన్నాడు.

హసన్ అబ్దుల్లా ఆనందబాష్పాలు రాలుస్తూ, "మహాప్రభూ, మీ తండ్రి బలాత్కారంగా లాక్కున్న ఈ పెట్టెను నేను ఇచ్ఛాపూర్వకంగా మీకిస్తున్నాను, పరిగ్రహించండి," అన్నాడు. ఖలీఫా హసన్ అబ్దుల్లా చేతిని ముద్దు పెట్టుకుని ఆ పెట్టె కథ ఏమిటో చెప్పమన్నాడు. హసన్ అబ్దుల్లా తన కథను ఈ విధంగా చెప్పాడు :

కైరోనగరంలో ఉన్న వర్తకులలోకెల్లా మాతండ్రి చాలా ధనికుడు. నేనాయనకు ఒక్కణ్ణే కొడుకును కావటంచేత నాకు గొప్ప గురువులను ఏర్పాటు చేసి విద్యావంతుణ్ణి చేశాడు. నాకు చక్కని కన్యను చూసి పెళ్లి చేశాడు. నే నామెతో పదేళ్లపాటు సుఖంగా కాపరం చేశాను.

ఆ తరవాత ప్రపంచంలో ఉన్న కష్టాలన్నీ ఒక్కసారిగా నాపైన విరుచుకుపడ్డాయి. నా తండ్రి ప్లేగు తగిలి మరణించాడు. మా ఇళ్లు కాలిపోయాయి. మా నౌకలు సముద్రంలో మునిగిపోయాయి. నేను సమస్తమూ పోగొట్టుకుని ముష్టిఎత్తి జీవించవలసివచ్చింది. ఒక్కొక్కసారి నేనూ, నా



భార్యా, పిల్లలూ పస్తులుండవలసివచ్చేది. అటువంటి పరిస్థితిలో ఒకనాడు నా భార్య తన ఆఖరు దుస్తులు నా చేతికిచ్చి, అవి అమ్ముకుని పిల్లలకు ఇంత రొట్టె తెమ్మన్నది.

నేను నా భార్యబట్టలు తీసుకుని పోతూండగా ఒంటెమీద సవారీ అయి ఒక బదవీ నా కెదురువచ్చాడు. అతను నన్ను చూసి ఒంటె దిగి, "హసన్ అబ్దుల్లా అనే గొప్ప వర్తకుడి ఇంటికి దారి ఎటు?" అని అడిగాడు.

"అరబ్బు మహాశయా, ఆ పేరు గల వాడెవడూ కైరోలో ఉన్నట్టు నాకు తెలియదు," అంటూ నేను దాటి పోబొయ్యాను. కాని అతను నా చెయ్యి పట్టుకుని ఆపి, "నువు హసన్ అబ్దుల్లావు కావా? అల్లా పంపిన అతిథిని వదిలించుకుంటావా?" అంటూ మందలించాడు. తరవాత అతను నన్ను అప్పుడిలాగా ఆలింగనం చేసుకుని నావెంట మాయింటికి వచ్చాడు.

నేను నాభార్య దుస్తులు అమ్మటానికి మరొకసారి బయటికి పోతూండగా అతను నన్ను ఆపి, నేను పోతున్న పని గ్రహించి, నా చేతిలో పది బంగారు కాసులు పెట్టి ఇంటికి కావలిసిన సంబారాలన్నీ తెమ్మన్నాడు. అతను పదిహేను రోజులపాటు నాకు అతిథిగా ఉండి ప్రతిరోజూ పదేసి బంగారు కాసులు నా చేత ఉంచుతూ వచ్చాడు. పదహారోనాడు అతను నాతో అకస్మాత్తుగా, "నాకు అమ్ముడవుతావా, హసన్? అందుకు నువు కోరినంత ధనం ఇస్తాను," అన్నాడు.

అతను వేళాకోళానికి అంటున్నాడనుకుని, "ఒక్క దెబ్బకు చచ్చేవాడి విలవ వెయ్యి దీనారాలు, అంతకన్న ఎక్కువ దెబ్బలకు గాని చావనివాడి విలవ పదిహేనువందలు. ఈ విషయం ఖురానులోనే చెప్పి ఉన్నది," అన్నాను. అతను పదిహేనువందలు ఇస్తానన్నాడు. అప్పుడు నాకు అతను నిజంగానే



అంటున్నాడని తెలిసింది. నాభార్యా పిల్లలైనా సుఖపడిపోతారని అమ్ముడు పోవటానికి ఒప్పుకున్నాను. అతను పదిహేనువందల దీనారాలు ఎంచి ఇస్తూ, "నేను నిన్ను నా ప్రయాణానికి తోడు ఉండగలందులకు కొన్నానే గాని, నీ ప్రాణానికీ స్వేచ్ఛకూ ఆటంకం ఏమీ ఉండబోదు," అన్నాడు.

ఆ సొమ్మంతా మావాళ్ల పరం చేసి, బదవీ కోరిన ప్రకారం ఒక ఒంటెను కొనుక్కుని, ప్రయాణానికి అవసరమైన పదార్థాలన్నీ కొని అతనివెంట బయలుదేరాను. త్వరలోనే మేము ఎడారిమార్గం పట్టి మనుష్య సంచారం లేని ఆ మార్గాన పదిరోజులు ప్రయాణం చేసి పదకొండో రోజుకు ఒక మైదానం చేరుకున్నాం.

ఆ మైదానం మధ్య ఒక ఎత్తయిన రాతి స్తంభం ఉన్నది. దానిపైన రాగితో చేసిన ఒక యువకుడి విగ్రహం నిలబడి ఉన్నది. ఆ యువకుడి కుడిచెయ్యి చాచి వేళ్లు తెరిచిఉన్నవి. అయిదు వేళ్లకూ అయిదు తాళపుచెవులు తగిలించి ఉన్నాయి. వాటిలో ఒకటి బంగారపుది, ఒకటి వెండిది, ఒకటి రాగిది, ఒకటి ఇనపది, ఒకటి సీసపుది. నాకు అప్పట్లో ఆ తాళపుచెవుల మర్మం తెలియక పోవటంచేత కష్టాలపాలయాను.

స్తంభాన్ని చేరగానే మేము ఒంటెలు దిగాము. బదవీ ఒక మెలికల విల్లూ బాణాలూ తీసి, ఎక్కుపెట్టి రాగివిగ్రహం కేసి కొట్టాడు. కాని బాణం అంత ఎత్తు పోలేదు. అతను విల్లును నా చేతికిచ్చి, విగ్రహం చేతివేళ్లకు తగిలించిన తాళపు చెవులు పడగొట్టమన్నాడు. అదృష్టవశాత్తూ నా మొదటి బాణంతో బంగారు తాళపుచెవి పడగొట్టి దాన్ని నాయజమాని కివ్వబోయాను, కాని అతను నన్నే ఉంచుకోమన్నాడు. అది కష్టాలు తెచ్చేది. ఆ సంగతి నేనెరగక దాన్ని బొడ్డులో పెట్టుకున్నాను. తరవాత నేను పడగొట్టిన వెండి తాళపుచెవినికూడా నా

యజమాని నన్నే ఉంచుకోమన్నాడు. అది బాధలు తెచ్చిపెట్టేది.

తరవాత నేను ఇనపతాళపు చెవినీ, సీసపుతాళపు చెవినీ పడగొట్టాను. బదవీ నా బలాన్నీ, గురినీ ఆనందంతో మెచ్చుకొంటూ, ఆ రెండు తాళపుచెవులనూ తీసుకున్నాడు. అవి సుఖాన్నీ, జ్ఞానాన్ని సమకూర్చేవి. నేను మరొక బాణం ఎక్కుపెట్టి రాగి తాళపు చెవిని పడగొట్టబోతూండగా బదవీ విల్లును నా చేతినుంచి లాగేసుకుని, "ఏం పనిచేస్తున్నావు, నిర్భాగ్యుడా?" అన్నాడు. అతను విల్లును నా చేతినుంచి గుంజటంలో బాణం నా కాలిమీద పడి గాయమై బాధ పెట్టసాగింది. అదే నా కష్టాలకూ బాధలకూ ఆరంభం. ఆ రాగితాళపు చెవి మృత్యువు తెచ్చిపెడుతుందట.

నా యజమాని నా గాయానికి కట్టుకట్టి నన్ను ఒంటెపై ఎక్కించాడు. మేము మూడు రోజులు ప్రయాణించి ఏవో పళ్ల తోటలు గల ఒక ప్రదేశానికి వచ్చాం. నా గాయం సలుపు పెడుతూనే ఉన్నది. నాకు దాహంగా ఉండటంచేత కుంటుకుంటూ వెళ్లి చెట్లమీద ఉన్న ఆ నవనవలాడే పళ్లలో ఒకటి కోసి నోటపెట్టుకుని కొరికాను. మరు క్షణం నా పళ్లు ఆ పండులో బిగుసుకు



పోయాయి. అరవటానికికూడా అవకాశం లేని స్థితిలో నేను గుడ్లు వెళ్లబెట్టి నేల మీద పడిపోయాను.

నా యజమానికి నా దుస్థితి అర్థంకాగానే ఆ చెట్లకిందికి పోయి కింద రాలిన పళ్లన్నీ విరిచూసి, పురుగులు తినేస్తున్న పండొకటి విరి దాని పురుగులను తీసి నా నోట్లో ఉన్న పండుపైన పెట్టాడు. అవి నా పండును తిని నన్ను రక్షించటానికి మూడురోజులు పట్టింది. ఆ మూడురోజులు నేను పడిన బాధ వర్ణనాతీతం. నా యజమాని నన్ను విడిచిపెట్టి వెళ్లక నా వెంటనే ఉన్నాడు; నా పక్కనే కూచుని ఆహారం తిన్నాడు, నిద్రపోయాడు.



నేనుమాత్రం ఆకలితో దహించుకుపోయాను. నా నోరు నాకు స్వాధీనమై ఏదైనా ఇంత తిని మంచినీళ్లు తాగుదాంగదా అనుకునేసరికి మా ఆహారపు సంచీ, నీళ్ల తిత్తీ ఖాళీ అయిపోయాయి. నేను భోరుమని ఏడిచాను. బదవీ నన్ను ఏదోవిధంగా ఊరడించి నాచేత ప్రయాణం కట్టించాడు. మేము ఆ రోజల్లా ప్రయాణించి ఒక కొండ దగ్గిరికి వచ్చాము. నా యజమాని నన్ను అవీ ఇవీ తిని లేనిపోని బాధలు తెచ్చుకోవద్దని హెచ్చరించి తానే వెళ్లి కొన్ని బ్రహ్మజెముడు మట్టలు కోసి తెచ్చాడు. అతను వాటి ముళ్లు చెక్కేసి, కత్తితో తోలుతీసి లోపలి గుజ్జు తినమని నా కిచ్చాడు. అది రుచిగానూ, బలకరంగానూ ఉన్నది.

చంద్రోదయం అయేవేళ నేను కంబళీ పరుచుకుని సుఖంగా పడుకుని నిద్రా సౌఖ్యం అనుభవింతామనుకుంటుండగా బదవీ నా కొక పని తగిలించాడు. "నువు ఇప్పుడే ఈ కొండ ఎక్కి ఈ రాత్రి కొండ శిఖరంపైన గడపాలి. ఇదే నువు నాకు చేయబోతున్న అసలు సహాయం. సూర్యోదయమైనదాకా కొండ శిఖరంపైన ఉండి, నమాజు చేసుకుని ఆ తరవాత కిందికి దిగిరా. పొరపాటునకూడా నిద్రపోవద్దు సుమా. నిద్రపోతే ఆ కొండగాలికి నీకు వాయువు కమ్ముతుంది," అన్నాడు.

అమ్ముడుపోయినవాణ్ణి యజమాని మాట వినకుండా ఎలా? అందుచేత నేను చచ్చినట్టు మూలుగుతూ ముక్కుతూ ఆ కొండ ఎక్కి శిఖరాన్ని చేరుకున్నాను. అప్పటికే నేను శరీరం బాధతోనూ, నిద్ర లేమితోనూ నలిగి ఉండటంచేత నిద్ర ముంచుకు వచ్చేసింది. మర్నాడుదయం సూర్యోదయం కాబోతుండగా నేను నిద్ర లేచి నా శరీరమంతా పుచ్చకాయలాగా వాచి ఉండటం గమనించాను. అతి కష్టంతో నేను లేచి నిలబడి తూర్పుగా తిరిగి నమాజు చేసి కిందికి దిగబోయాను.

కాని నా అవయవాలు ఏమాత్రమూ స్వాధీనంలో లేనందున నేను పడి కొండ కిందిదాకా దొర్లాను.

నా యజమాని నాకేసి చూడనుకూడా లేదు. అయన నేలమీద ఏదో గీతలు గీస్తూ, "నీ నీడనుబట్టి రహస్యం తెలిసిపోయింది. ఇక్కడ తవ్వుదాం పట్టు!" అన్నాడు. నేను పెద్దగా ఏడవసాగాను. అప్పుడు అతను నాకేసి చూసి, కొండమీద నిద్రపోయినందుకు నన్ను కోప్పడి కత్తితో నా కీళ్లలో పొడిచాడు. రక్తానికి బదులు నీరు పచ్చింది. నా బాధ చాలావరకు నివారణ అయింది.



అతను గుర్తుపెట్టిన చోట ఇద్దరమూ తవ్వగా లోతున ఒక చలవరాతి సమాధి కనిపించింది. అందులో మనిషి అస్థికలూ, తోలుపైన రాసిన ఒక శాసనమూ కనిపించాయి. బదవీ ఆ శాసనాన్ని ఆత్రంగా చదివాడు. "హసన్, మనుష్యమాత్రులెవరూ చూడని ఇరామ్‌నగరానికి మార్గం ఇందులో రాసిఉన్నది. ఏ లోహాన్నయినా బంగారంగా మార్చగల సిందూరగంధకం అక్కడ మనకు దొరుకుతుంది," అన్నాడతను.

మేము కొండను చుట్టి పడమరగా మూడు రోజులు ప్రయాణించి ఒక పాముల లోయలోకి చేరాం. అక్కడ ఎటు చూసినా నల్లటి కొండచిలువలు పాకుతూ కనిపించాయి. నా యజమాని నా చేతికి విల్లూ, బాణమూ ఇచ్చి, "కొమ్ములుండే పాముగా చూసి దాన్ని చంపి దాని తలా గుండెకాయా పట్టుకురా," అన్నాడు. నేను ప్రాణాలపై ఆశ విడిచిపెట్టి ఆ లోయలోకి వెళ్లాను. కొంతసేపటికి నాకొక కొమ్ములు గల పాము కనిపించింది. అదృష్టవశాత్తూ నేను దాన్ని చంపి తలా, గుండెకాయా తీసుకు రాగలిగాను. నా యజమాని నాచేత నిప్పు చేయించి దానిమీద ఒక ఇనప భగోణీ పెట్టి అందులో పాముతలా, గుండే వేసి కాచాడు.

అందులో ఇంకేదో ద్రావకం రెండు చుక్కలు వేసి మంత్రాలు చదివాడు. తరవాత ఆయన తన భుజాలమీద ఆ భగోణీలోని ద్రవాన్ని రుద్దమన్నాడు. నేనలా చేసేసరికి ఆయనకు అప్పటికప్పుడే రెక్కలు మొలిచాయి. నాకు కూడా అలాగే రెక్కలు తెప్పించినాక ఆయన నాతోపాటు ఆకాశంలోకి ఎగిరాడు.

అలా ఎగురుతూ మేము ఇరామ్‌నగరం చేరాము. ఆ నిర్జననగరంలో మేము చూసిన సిరిసంపదలు వర్ణించ నలవికాదు. కాని మేము అక్కడినుంచి తెచ్చుకున్నది "కీమియా" అనే సింధూరగంధకం మాత్రమే. నాకా కీమియాలో నమ్మకం లేక రత్నాలూ, ముత్యాలూ పోగుచేయ యత్నించాను. కాని నా యజమాని మండి పడి నాచేత వాటిని పారేయించాడు.

తరవాత మేము ఎలాగో కైరో చేరుకున్నాం. ఎందుకోగాని అన్ని కష్టాలూ నాకే కలిగాయి. నేను ముందుగా మా యింటికి పరిగెత్తాను. కాని అక్కడ నావారెవరూ లేరు. అందరూ పోయినట్టు తెలిసి నేను దుఃఖంతో కుమిలిపోయాను. నా యజమాని నన్ను ఓదార్చి తనవెంట నన్నొక అద్భుతమైన భవనానికి తీసుకుపోయాడు. మేము తెచ్చిన కీమియాతో అంతులేని బంగారం చేశాము. కొంతకాలానికి నా యజమాని చనిపోయి తన సర్వస్వమూ నాపరం చేశాడు.

నావద్ద ఉన్న బంగారు వెండితాళపు చెవులే నన్నిన్నిబాధలూ పెట్టాయని తెలిసి వాటిని కరిగించివేస్తుండగా మీ తండ్రిగారి భటులు వచ్చి నన్ను ఖైదుచేశారు. నన్ను మీ తండ్రిగారు బంగారం చేసే మర్మం చెప్పమన్నారు. నేను చెప్పలేదు. మీకు చెప్పేస్తున్నాను. ఈ ఎర్రపొడే ఆ మర్మం. దీన్ని మీరు వినియోగించుకోండి.

ఈ కథ విని ఖలీఫా మహమ్మద్ ఎంతో సంతోషించి హసన్‌అబ్దుల్లాను తన ఆప్తులలో ఒకడుగా చేసి ఎంతో ఆదరించాడు.



# కాకి తెచ్చిన టపాకాయలు






# సుహాసిని

ధవళగిరి రాజైన యశోధనమహారాజు ఆదర్శప్రాయుడైన రాజు. ప్రజలను సుఖ పెట్టటానికి ఆయన అస్తమానమూ పాటు పడేవాడు. ఒకనాడాయన తన రాజధాని శివార్లలో మారువేషంతో తిరుగుతూండగా ఒక పూరిగుడిసెలో ముగ్గురు అప్పచెల్లెళ్లు కూచుని మాట్లాడుకుంటూ ఉండటం ఆయనకు వినిపించింది.

ముగ్గురిలోకీ పెద్దది, "నాకు రాజుగారికి ఫలహారాలు చేసేవాణ్ణి పెళ్లాడాలని ఉన్నది. అలా అయితే రాజుగారు తినగా మిగిలిన ఫలహారాలన్నీ కూచుని హాయిగా తిన వచ్చు," అన్నది.

"ఫలహారాలతో ఏం కడుపు నిండుతుంది. నాకు రాజుగారి వంటవాణ్ణే చేసుకోవాలని ఉన్నది," అన్నది రెండవది.

మూడవది ఏమీ అనలేదు. కాని దాని అక్కలు ఒత్తిడిచేసి, "నీకెవరిని చేసుకోవాలని ఉన్నదో చెప్పు!" అన్నారు. చివరకామె "నాకు రాజుగారినే చేసుకుని రత్నాలవంటి బిడ్డలను కనాలని ఉన్నది," అన్నది.

ఈ మాటలు విన్న రాజుగారు వారి ముగ్గురి కోర్కెలూ తీర్చటానికి నిశ్చయించి, మర్నాడు ఆ అప్పచెల్లెళ్ళను పిలిపించాడు. ఒకే ముహూర్తంలో ముగ్గురికీ పెళ్లిళ్ళు అయాయి. అయితే ఆఖరు చెల్లెలి పెళ్లి రాజుగారితో గనక అత్యంత వైభవంగా అట్టహాసంగా జరిగింది.

తాను రాణి అయినానని ఆఖరు చెల్లెలు గర్వించలేదు. ఆమె తన అక్కలను ఎంతో ఆదరంతో చూసేది, వారి కేలోటూ రానిచ్చేది కాదు. కాని అక్కలుమాత్రం తమ చెల్లెలి వైభవం చూడలేక ఎప్పుడూ అసూయతో కుమిలిపోసాగారు.

యశోధనమహారాజు మాత్రం తన భార్యను ఎంతో ప్రేమగా చూసేవాడు. ఆమె

టి. జగన్నాథం

తక్కువ వంశంలో జన్మించినా ఎంతో ఉదార బుద్ధీ ధర్మగుణం కలది. ఆమె అన్నివిధాలా ఆయనకు తగిన భార్య అనిపించుకున్నది.

కొద్దికాలానికి రాణి గర్భవతి అయింది. కనే రోజులు వచ్చాయి. ఆమె అక్కలు ఆమెకు స్వయంగా పురుడు పోయవచ్చారు. రాణికి చక్కని మగపిల్లవాడు పుట్టాడు. అది చూసి వాళ్ళు మరింత అసూయ పడ్డారు. వారా పిల్లవాణ్ణి ఒక తొట్టెలో పెట్టి రాజభవనం పక్కగా ప్రవహించే కాలవలో వదిలేసి, ఒక కుక్కపిల్లను తెచ్చి బాలింతరాలి పక్కలో పెట్టారు.

తన భార్య కుక్కపిల్లను ప్రసవించిందని వినగానే రాజుకు గుండె ఆగిపోయినట్టయింది. కాని అయనకు తన భార్యపైన ఆగ్రహం కలగలేదు.

రాణిగారి అక్కలు తొట్టెలో పెట్టిన కుర్రవాడు రాజుగారి తోటమాలికి దొరికాడు. సంతానం లేని ఆ తోటమాలి ఆ పిల్లవాడికి సుజాతుడని పేరు పెట్టుకుని పెంచుకోనారంభించాడు.

మరుసటి ఏడు రాణి మరొక పిల్లవాణ్ణి ప్రసవించింది. ఆమెకు పురుడు పోసిన అక్కలు ఈసారి ఆమె పక్కలో ఒక పిల్లిని



పెట్టి ఆ కుర్రవాణ్ణికూడా కాలవలో వదిలేశారు. వాడుకూడా తోటమాలికి దొరికాడు. తోటమాలి వాడికి సుకేతుడని పేరు పెట్టుకుని పెంచసాగాడు.

తన రాణి వరసగా రెండుసార్లు గర్భవతి అయి జంతువులను ప్రసవించటం చూసి రాజు చాలా బాధపడ్డాడు, కాని రాణిపై ప్రేమ గలవాడు కనక క్షమించాడు.

మూడవసారి రాణి ఆడపిల్లను ప్రసవించింది. ఆమె అక్కలు ఈసారి ఆమె పక్కలో ఒక ఎలుకను ఉంచి ఆడపిల్లనుకూడా నీటిలో వదిలేశారు. ఆ పిల్ల కూడా తోటమాలికి దొరికింది. ఆ పిల్ల

చాలా అందగత్తె. ఆమె ముఖం వికసించిన పుష్పంలాగా ఉండేది. ఆమె నవ్వితే ముత్యాలు రాలేవి. ఆమెకు తోటమాలి సుహాసిని అని పేరు పెట్టుకున్నాడు.

ముగ్గురు పిల్లలూ ఇంకా చిన్నవాళ్ళుగా ఉండగానే తోటమాలి భార్య మరణించింది. అతను రాజుగారివద్ద కొలువు చాలించుకుని, ఆయన ఇచ్చిన సొమ్ముతో ఊరి బయట ఒక చక్కని ఉద్యానవనం నిర్మించుకుని, అందులో పెద్ద కుటీరం వేసుకుని, తన బిడ్డలను చూసి ఆనందిస్తూ చాలాకాలం జీవించాడు. పిల్లలు ఎదిగివచ్చే సమయానికి తోటమాలి చనిపోతూ సుహాసినిని ప్రాణంతో సమంగా కాపాడమని సుజాతుడికీ, సుకేతుడికీ చెప్పిపోయాడు.

అన్నలు ఎప్పుడైనా వేటకు వెళ్లేవారు గాని సుహాసిని ఎన్నడూ తన ఉద్యానవనం దాటి బయటికి వెళ్ళి ఎరగదు. ఒకనాడామె ఆ ఉద్యానంలో ఒంటరిగా ఉన్న సమయంలో ఒక ముసలిది వచ్చి, "ఆహా, ఎంత చక్కని తోట! ఈ చెట్ల నీడలో ఎంత చల్లగా ఉంది! కాస్సేపు ఇక్కడ కూచుని పోనిస్తావా, తల్లీ?" అని సుహాసినితో అన్నది.

సుహాసిని ఆ ముసలిదానితోబాటు చెట్ల నీడన కూచుని, "ఈ తోటలో నీకేమైనా లోపాలు కనిపించాయా, అవ్వా?" అన్నది.



"మాట్లాడే పక్షీ, పాడే చెట్టూ, జీవజలమూ ఉన్నట్టయితే ఈ తోటలాటిది ప్రపంచంలో మరొకటి ఉంటుందా, తల్లీ?" అన్నది ముసలిది.

ఆ మూటినీ ఎలాగైనా సాధించాలని సుహాసినికి తోచింది. "అవి ఎక్కడ ఉంటాయవ్వా?" అని ఆమె ముసలిదాన్ని ఆత్రంగా అడిగింది.

"తూర్పుగా బయలుదేరి ఇరవై రోజులు గుర్రంమీద ప్రయాణం చేసి ఇరవయ్యో రోజున కనిపించే మొదటి మనిషిని అడిగితే అవి ఎక్కడ ఉండేదీ చెబుతాడు. కాని వాటిని తీసుకురావటం సులభంకాదు, తల్లీ!" అన్నది ముసలిది, లేచి తన దారిన బయలుదేరుతూ.

అన్నలు ఇంటికి రాగానే సుహాసిని వారితో ముసలిదాని మాటలు చెప్పింది. అంతా విని సుజాతుడు, "నేను రేపే బయలుదేరి వెళ్ళి వాటిని తెచ్చి మన ఉద్యానంలో ఉంచుతాను!" అన్నాడు.

అతను మర్నాడే తన గుర్రం ఎక్కి తూర్పుగా బయలుదేరాడు.

అతను ఇరవై రోజులూ పగలనక రాత్రనక ప్రయాణం చేసి ఒక అరణ్య మధ్యంలో ఉన్న ఒక పెద్ద కొండ దగ్గిరికి వచ్చాడు. కొండ కింద గల ఒక మహావృక్షం





కింద అతనికి తపస్సు చేసుకుంటున్న కపిల మహాముని కనిపించాడు.

అ రోజు తనకు కనబడిన మొదటి మనిషి అయనే గనక సుజాతుడు అయనను పలకరించి, "మునీశ్వరా, మాట్లాడే పక్షీ, పాడేచెట్టూ, జీవజలమూ ఎక్కడ ఉంటాయో దయచేసి చెబుతారా ?" అని అడిగాడు.

"అవి ఈ కొండ శిఖరంపైనే ఉన్నాయి. కాని వాటికోసం వెళ్లినవారెవరూ తిరిగి రాలేదు, నాయనా !" అన్నాడు కపిలుడు.

సుజాతుడు భయపడక కొండ ఎక్క సాగాడు. అతనికి దారివెంబడి నల్లరాతి మనుష్య విగ్రహాలు కనిపించాయి. మనుష్యులే శిలలుగా మారారని అతనికి తెలియదు. కొంతదూరం వెళ్ళేసరికి అతన్ని ఎవరో గదమాయిస్తున్నట్టూ, భయపెడుతున్నట్టూ అనిపించింది.

అతను అగి అటూ ఇటూ పరీక్షగా చూశాడు. మరుక్షణమే అతనుకూడా ఒక శిల అయిపోయాడు.

నలభైరోజులు గడిచినా తన అన్న తిరిగి రాకపోవటం చూసి సుకేతుడు బయలుదేరాడు. వెళ్ళవద్దని సుహాసిని ఎంత బతిమాలినా అతను వినలేదు. అతనుకూడా అన్నలాగే కపిలుణ్ణి చూసి, అయన వద్దంటున్నకొద్దీ కొండ ఎక్కి, కేకలు విని భయపడి చుట్టూ తిరిగి చూసి నల్లరాతిశిల అయిపోయాడు.

తన అన్నలు తిరిగి రారని రూఢికాగానే సుహాసిని హృదయం రాయిలాగా అయిపోయింది. ఆమె కనీసం వారినైనా తెచ్చుకుందామనే ఉద్దేశంతో గుర్రమెక్కి బయలుదేరి కపిలుడుండే చోటికి వచ్చింది. ఆమె తన సంగతి యావత్తూ ఆయనతో చెప్పుకుని, "మునీశ్వరా, నా అన్నలు ఇటుగా వచ్చారా ?" అని కపిలుణ్ణి అడిగింది.

"వచ్చారు. వారు శిలలైపోయారమ్మా!" అన్నాడు కపిలుడు.



"స్వామీ, వారిని బతికించుకోవట మెలాగ? వాళ్ళు తప్ప నాకు దిక్కులేదు," అన్నది సుహాసిని.

"ఆ కొండ ఎక్కి మాట్లాడే పక్షినీ, పాడే చెట్టునూ, జీవజలాన్నీ తెచ్చుకుంటేనే నీ అన్నలను బతికించుకోగలవు. నీవు వాటి కోసం కాక, నీ అన్నలకోసం పోతున్నావు గనక నీకు విజయం లభిస్తుంది!" అన్నాడు కపిలుడు.

ఆమె కొండ ఎక్కేటప్పుడుకూడా కేకలూ, అరుపులూ వినిపించాయి. కాని ఆమె వాటికి బెదరలేదు. ఆమె కొండ శిఖ రాన్ని చేరుకుని అక్కడ పంజరంలో ఉన్న పక్షిని చూసింది. అదే మాట్లాడే పక్షి.

ఆ పక్షి ఆమెకు పాడేచెట్టునూ, జీవజలం ఉన్న మడుగునూ చూపింది. పక్షి సలహాపై ఆమె పాడేచెట్టు మండ ఒకటి విరుచుకుని జీవజలం తీసుకుని పక్షితోసహా బయలు దేరింది. ఆమె దారిలో ఉన్న శిలలన్నిటిపైనా జీవజలం ఒక్కొక్క చుక్క వేస్తూ వచ్చింది. అక్కడవున్న రాళ్ళన్నీ రాజ కుమారులుగా మారాయి. వారిలో ఆమె అన్నలుకూడా ఉన్నారు.

ముగ్గురూ కలిసి తమ తోటకు తిరిగి వచ్చారు. తోటలోకి మాట్లాడే పక్షి రాగానే ఎక్కడెక్కడి పాడే పక్షులూ వచ్చి తోటలో కాపరం పెట్టి సంవత్సరం పొడుగునా పాడ సాగాయి. పాడేచెట్టు మండ పాతిపెట్టగానే దాని ఆకులు పాడసాగాయి. ఆ పాట విన టానికి పిల్లవాయువులు తోటను ఆశ్రయించాయి. జీవజలం ఒక చుక్క వేసే టప్పటికి ఆ తోటలోని నీటికాలవలన్నీ గల గల శబ్దం చేస్తూ ఏడాదిపొడుగునా పారటం ఆరంభించాయి.

సుహాసిని ఉండే తోటనుగురించి అందరూ వింతగా చెప్పుకోసాగారు. రాజు గారికికూడా ఈ వార్త తెలిసింది. తన భార్య మూడవసారికూడా జంతువును

కన్నట్టు తెలిసినాక ఆయన ఆమెను కారాగృహంలో పెట్టించాడు. అదిమొదలు ఆయన ఆనందమన్నది ఎరగడు. ఈ తోటలో కాస్సేపు కూచుంటే మనస్సు బరువు తగ్గుతుందేమోనని ఆయన ఒకనాడు ఒంటరిగా అక్కడికి వచ్చాడు.

ఆ సమయాన సుహాసిని ఒంటరిగా ఉన్నది. రాజుగారు తనకు అతిథిగా వచ్చాడని తెలియగానే ఆమె కంగారుపడి మాట్లాడే పక్షి వద్దకు వెళ్ళి, "పక్షీ, పక్షీ! రాజుగారికి ఏమి వంటకాలు చెయ్యమన్నావు?" అని అడిగింది.

"ముత్యాలు కూరిన అరిసెల్లు వండి పెట్టు!" అన్నది పక్షి. సుహాసిని అలాగే చేసి అరిసెలు రాజుముందు పెట్టింది. రాజు ఒక అరిసెను విరిచిచూసి, "ఇదేమిటి, ఇందులో ముత్యాలు కూరారు. ఇలాటి వంటకం ఎక్కడైనా ఉంటుందా?" అని ఆశ్చర్యంగా అడిగాడు.

"రాణి గర్భవాసాన కుక్కలూ, పిల్లులూ, ఎలుకలూ పుట్టటం ఎక్కడైనా ఉందా, మహారాజా?" అని మాట్లాడే పక్షి ఆయన్ను అడిగింది.

రాజుకు గుండె గతుక్కుమన్నది. "నా భార్య పిల్లలనే కన్నదా? వా రేమయారు?" అని ఆయన పక్షిని అడిగాడు. సరిగా ఆ సమయానికే సుజాతుడూ, సుకేతుడూ వేట నుంచి తిరిగివచ్చారు.

"ఇరుగో నీ పిల్లలు!" అన్నది మాట్లాడే పక్షి వారిని రాజుకు చూపుతూ.

రాజుకంట ఆనందబాష్పాలు రాలాయి. ఆయన తన పిల్లలను ఆలింగనం చేసుకుని ఇంటికి తీసుకుపోయాడు. తన భార్యను చెర విడిపించి ఆమెకు క్షమాపణ చెప్పుకున్నాడు. అక్కలు తనకు తీరని ద్రోహం చేసినా రాణి వారిని క్షమించింది.

తరవాత యశోధన మహారాజు తన భార్యతోనూ పిల్లలతోనూ సుఖంగా జీవించాడు.






# కవల పిల్లలు

పూర్వం కాంచన నగరంలో ధనపాలుడనే వర్తకుడుండేవాడు. ఆయన వర్తకం నిమిత్తమై స్వర్ణద్వీపానికి వెళుతూ తన భార్యనుకూడా వెంటపెట్టుకు వెళ్లాడు. వారక్కడ ఒక సంవత్సరం ఉండవలసి వచ్చింది. ఆ కాలంలో ధనపాలుడి భార్య కవలపిల్లలను ప్రసవించింది. వారిద్దరూ మగపిల్లలు, అచ్చుగా ఒకే పోలిక. ధనపాలుడు తన కొడుకు లిద్దరికీ మాధవుడు అనే పేరు పెట్టుకున్నాడు; ఒకడు పెద్ద మాధవుడు, రెండోవాడు చిన్నమాధవుడు.

చిత్రమేమిటంటే ధనపాలుడి భార్య కవలపిల్లలను కన్నరోజునే ఆ సమీపంలో ఒక పేదవాడి భార్యకూడా కవలపిల్లలను కన్నది; వారూ మగపిల్లలే, ఒకే పోలిక గల వారే. వారి తండ్రిఅయిన పేదవాడు ధనపాలుడితో, "బాబూ, మాకే పొట్ట గడవటం లేదు, ఈ పిల్లలను నేను పెంచలేను. మీ పిల్లలతోబాటు వీళ్లనుకూడా పెంచుకోండి, మీ పిల్లలకు నౌకరీ చేస్తూ బతుకుతారు," అని ప్రార్థించాడు. ధనపాలుడు ఆ పేదవాడికి ఇంత డబ్బిచ్చి ఆ కవలపిల్లలను కూడా తానే పెంచాడు. వారి కిద్దరికీ రాముడనే పేరు పెట్టారు. ఒకడు పెద్దరాముడు, ఇంకొకడు చిన్నరాముడు.

ఈ కవలలు పుట్టిన కొద్ది మాసాలకు ధనపాలుడు వచ్చిన పని అయిపోయింది. ఆయన ఒక నౌకలో తన భార్యనూ, ఇద్దరు మాధవులనూ, ఇద్దరు రాములనూ ఎక్కించుకుని స్వర్ణద్వీపంనుంచి కాంచననగరానికి బయలుదేరాడు. కాని దురదృష్టవశాత్తూ సముద్ర మధ్యంలో తీవ్రమైన తుపాను చెలరేగింది. నౌక దారితప్పి పోయిపోయి ఒక పర్వత మయమైన తీరాన పగిలి ముక్కలయింది. ఈ ప్రమాదంమూలాన ధనపాలుడూ, పెద్దమాధవుడూ, పెద్ద

ఆర్. కోదండరామయ్య



రాముడూ ఒక జట్టుగానూ, ధనపాలుడి భార్యా, చిన్నమాధవుడూ, చిన్నరాముడూ ఒక జట్టుగానూ చీలిపోయారు. సముద్ర తీరాన గల కొందరు పల్లెకార్లు ధనపాలుడి భార్యనూ ఆమె వెంట ఉన్న పిల్లలనూ రక్షించి రుద్రపురం అనే నగరానికి చేర్చారు. ధనపాలుడు ఒక తెప్ప సహాయంతో తన వెంటఉన్న పిల్లలిద్దరినీ కాపాడుకుంటూ మరొకచోట ఒడ్డు చేరుకుని ఎలాగో కాంచన నగరంలో వచ్చిపడ్డాడు.

పద్దెనిమిదేళ్లు గడిచాయి. ఈలోపల రుద్ర పురం చేరిన చిన్నమాధవుడు అక్కడి రాజు గారి కొలువులో చేరి, యుద్ధాలలో బల



పరాక్రమాలు ప్రదర్శించి మంచి కీర్తి సంపాదించుకున్నాడు. అతను మంజరి అనే ఆమెను పెళ్లాడాడు. అతని నౌకరయిన చిన్నరాముడుకూడా గంగ అనేదాన్ని పెళ్లాడి తన యజమాని ఇంటనే ఉంటున్నాడు. గంగ వంటపనీ, ఇంటిపనీ చూస్తూ మంజరికి సేవ చేస్తున్నది.

ధనపాలుడి వెంటఉన్న పెద్దమాధవుడు తన కొక తమ్ముడున్నాడనీ, చిన్నతనంలోనే సముద్రంమీద తుపాను వచ్చిన ఫలితంగా తనకు దూరమైనాడనీ తెలియగానే, తన నౌకరయిన పెద్దరాముణ్ణి వెంటబెట్టుకుని తమ్ముణ్ణీ, తల్లినీ వెతుక్కుంటూ బయలు దేరాడు. వెళ్లినవాడు మళ్లీ తిరిగి రాలేదు. అయిదేళ్లు గడిచాయి. ధనపాలుడికి పుత్ర వియోగబాధ పట్టుకున్నది. ఆయన తన వ్యాపారాన్నీ, ఇంటినీ, ఆస్తినీ వదిలేసి తన కొడుకును వెతుకుతూ తానుకూడా దేశాల మీద బయలుదేరాడు.

ఇల్లు వదిలిన రెండేళ్ళకు ధనపాలుడు రుద్రపురం చేరుకున్నాడు. ఆయన ఆ నగ రంలో అడుగు పెట్టగానే రాజభటులు ఆయ నను ప్రశ్నించి, కాంచన నగరవాసుడని తెలుసుకుని, రాజుగారి వద్దకు పట్టుకు వెళ్ళారు. ఎందుచేతనంటే కొద్దికాలంగా







కాంచననగరానికీ రుద్రపురానికీ మధ్య స్పర్ధలు చెలరేగాయి. రుద్రపురంలో ఉండే కాంచన నగరవాసులందరినీ వెళ్ళగొట్టారు, కొందరిని ఖైదులోకూడా ఉంచారు. ఈ సంగతులేవీ ధనపాలుడికి తెలియవు. తాను రెండేళ్ళుగా తన పెద్దకుమారుడికోసం వెతుకుతున్నాననీ, వాడు ఏడేళ్ళక్రితం తన తమ్ముడికోసం వెతుకుతూ బయలుదేరాడనీ ఆయన రాజుగారితో చెప్పాడు.

"శాసనం ప్రకారం మిమ్మల్ని ఖైదు చెయ్యాలి. అయితే మీరు పెద్దమనిషిగా కనిపిస్తున్నారు గనక ఎక్కడైనా వెయ్యి వరహాలు తెచ్చి ధరావతుగా కట్టండి. అలా చేసినట్టయితే మీకు ఖైదు తప్పు తుంది," అని రాజుగారు ధనపాలుడి వెంట ఒక భటుణ్ణి ఇచ్చి నగరంలోకి పంపించాడు.

ధనపాలుడు రుద్రపురం చేరిననాడే పెద్ద మాధవుడూ, పెద్దరాముడూ కూడా ఆ నగరం చేరారు. అయితే వాళ్లు తమది కాంచన నగరమని చెప్పుకోలేదు, అలా చెబితే ప్రమాదమని వారికి ముందుగానే తెలిసింది. కాంచననగరం నుంచి వచ్చిన ఒక పెద్ద మనిషిని రాజభటులు పట్టుకుపోయారని విని పెద్దమాధవుడు చాలా జాలిపడ్డాడు. ఆ పెద్దమనిషి తన తండ్రేనని అతను ఊహించనుకూడా లేదు. అందుచేత అతను తన తండ్రిని కాపాడుకునే యత్నం ఏమీ చేయలేదు.

ఆ పూళ్ళోనే హెూదాతో బతుకుతూన్న చిన్నమాధవుడుకూడా తన తండ్రికి సులువుగా సహాయం చేసి ఉండును. కాని అతనికి తన తండ్రిని గురించిగాని, అన్నగురించిగాని, ఆఖరుకు తల్లిగురించిగాని తెలియనే తెలియదు. ఎందుచేతనంటే అతనినీ, అతని నౌకరయిన రాముణ్ణీ, అతని తల్లినీ కాపాడిన పల్లెకార్లు ధనలోభంచేత పిల్లలను వేరుచేసి ఒక సామంతుకు అమ్మేశారు. ఆ సామంతువద్ద పెరిగి పెద్దవాడైన చిన్నమాధవుణ్ణి రాజుగారు

ఒకనాడు చూసి ముచ్చట పడి తన సైన్యానికి ఒక నాయకుడుగా నియోగించాడు.

ఆ రోజే నగరానికి చేరుకున్న పెద్ద మాధవుడూ, పెద్దరాముడూ ఒక బస కుదుర్చుకుని, నగరం పర్యటించబోయారు. కొంతసేపు తిరిగాక పెద్దమాధవుడు తన నౌకరు చేతికి కొంత డబ్బిచ్చి, "దీన్ని మన బసలో ఇచ్చి వంట సిద్ధం చేయమని చెప్పు. నేను మరికొన్ని వీధులు చుట్టబెట్టి భోజనం వేళకు చేరుకుంటాను!" అన్నాడు.

పెద్దరాముడు వెళ్ళిన కొద్దిసేపటికే పెద్ద మాధవుడికి వాడు తిరిగి రావటం కనిపించింది. అయితే ఈ వచ్చినవాడు చిన్న రాముడు. ఆ సంగతి తెలియక పెద్ద మాధవుడు, "అప్పుడే వచ్చేశావేమిటిరా? నేనిచ్చిన డబ్బేంచేశావు?" అని అడిగాడు. ఇద్దరు రాములూ అచ్చు ఒకేలాగుండటం చేత అతనికి తేడా తెలియరాలేదు.

పెద్దమాధవుడు పడిన పొరపాటే చిన్న రాముడుకూడా పడ్డాడు. వాడు ఆ మాధవుణ్ణి చూసి తన యజమానే అనుకుని, "అమ్మగారు అన్నానికి రమ్మంటున్నారండి. వంటకాలన్నీ చల్లారిపోతున్నాయిట!" అన్నాడు.

"చాల్లే నీ వేళాకోళాలు! దానికి వేళా పాళా ఉండవద్దా? డబ్బేం చేశావు?" అన్నాడు పెద్దమాధవుడు.



"అయ్యో బాబూ, అమ్మగారు మిమ్మల్ని నిలుచున్న పాళంగా తీసుకురమ్మం టున్నారు," అన్నాడు చిన్నరాముడు.

"అమ్మగా రెవ(రా?" అన్నాడు పెద్ద మాధవుడు అయోమయంగా.

"మీ భార్యాగారేనండీ!" అన్నాడు చిన్న రాముడు. పెద్దమాధవుడి కింకా పెళ్లి అయినా కాలేదు. అతనికీ మాట విని కోపం వచ్చి, "ముందు డబ్బేమయిందో చెప్పు, వెధవా. వె(రిమాటలు మాట్లాడితే పళ్ళు రాలగొడ తాను," అన్నాడు.

"మీరే పరాచకాలాడుతున్నారు నాతో. ముందు బొంచేసి ఆ తరవాత నన్ను తాపీగా తిట్టండి!" అన్నాడు చిన్నరాముడు. పెద్ద మాధవుడు వాణ్ణి మెత్తగా తన్నాడు. చిన్న రాముడు ఇంటికి పారిపోయి మంజరితో, "అమ్మా. ఇంటికి రమ్మంటే అయ్యగారు నన్ను చచ్చేటట్టు కొట్టారు," అని చెప్పాడు.

మంజరి అసలే చాలా అసూయగల మనిషి. తన అనుమానాలతోనూ, అసూయ తోనూ తన భర్త అయిన చిన్నమాధవుణ్ణి అస్తమానం రాచి రంపాన పెడుతూండేది. మంజరికి మాలతి అని ఒక చెల్లెలున్నది. తన అక్క తన బావను సూటిపోటి మాట లనకుండా చెయ్యాలని మాలతి ఎన్నో (ప్రయత్నాలు చేసేది.





చిన్నరాముడు చెప్పిన మాటలు వినగానే మంజరికి తన భర్తపై రకరకాల అనుమానాలు కలిగాయి. అతను ఇంకెవతెనో ప్రేమించి ఉండాలి. అందుకే భోజనానికి ఇంటికి రావలచలేదు, అని ఆమె నిశ్చయించుకున్నది. తన భర్తను నాలుగు మాటలూ అడిగే ఉద్దేశంతో ఆమె బయలు దేరింది. ఈలోపల పెద్దమాధవుడు తన బసకు చేరుకుని అక్కడ తన నౌకరూ, డబ్బూ భద్రంగా ఉన్న సంగతి తెలుసుకున్నాడు. అంతకు పూర్వం తనతో అర్థంలేని సంభాషణ చేసినందుకు రాముణ్ణి మళ్ళీ నాలుగు చివాట్లు పెట్టే ప్రయత్నంలో అతను ఉండగా, మంజరి అక్కడికి వచ్చి అతన్ని చూసి తన భర్తే అని పొరపడింది. తనకేసి కొత్తగా చూస్తున్న పెద్దమాధవుడితో ఆమె, "ఎవరినో చూసినట్టు చూస్తారేమిటి? నేనప్పుడే అంత దూరమై పోయానా? పెళ్లి అయిన కొత్తలో ఎంత ప్రేమగా ఉండేవారు! ఆ ప్రేమంతా ఏమైపోయింది? నేనేం పాపం చేసుకున్నాను?" అన్నది.

"నాతోనేనా మాట్లాడుతున్నారు?" అని అడిగాడు పెద్దమాధవుడు. తాను ఆమెను ఎన్నడూ చూడలేదనీ, రుద్రపురానికి తాను వచ్చి రెండు గంటలే అయిందనీ అతను ఆమెతో అన్నాడు. కాని ఆమె అతని మాట ఒక్కటికూడా వినిపించుకోక, "ఈ బొల్లి కబుర్లన్నీ కట్టిపెట్టి నావెంట వచ్చేస్తారా, రారా?" అని గదమాయించి అడిగింది. చేసేది లేక పెద్దమాధవుడు మంజరివెంట వెళ్లాడు. అక్కడ మంజరీ, మాలతీ అతని వెంట భోజనం చేశారు. మంజరి అతనితో భార్యలాగే మాట్లాడింది. మాలతి అతన్ని "బావా" అని సంబోధించింది. అతనికి తాను మేలుకుని ఉన్నదీ, కలగంటున్నదీ కూడా తెలియలేదు.

పెద్దమాధవుడి వెంటవచ్చిన పెద్దరాముడికికూడా అలాటి అనుభవమే అయింది.

ఎందుచేతనంటే గంగకూడా వాడిపట్ల భార్యలాగే ప్రవర్తించింది. గంగ చాలా గయ్యాళి భార్య.

అందరూ లోపల అన్నాలు తినే సమయంలో మంజరి అసలుభర్త అయిన చిన్నమాధవుడు తన నౌకరయిన చిన్న రాముడితోకూడా ఇంటికి తిరిగివచ్చి వీధి తలుపు తట్టాడు. ఎవరు వారని అడిగితే మాధవుడూ, రాముడూ అని జవాబు వచ్చింది. "వాళ్లిద్దరూ ఇంటో అన్నాలు తింటున్నారు. మీరెవరో గాని వెంటనే దయచెయ్యండి!" అని నౌకర్లు జవాబు చెప్పారు. తన భార్య ఎవరినో తన పంక్తిన పెట్టుకుని అన్నం తింటున్నదని విని మంజరి భర్తఅయిన చిన్న మాధవుడు మండిపడ్డాడు.

భోజనాలు కాగానే ఏదో వంక పెట్టి పెద్ద మాధవుడూ, పెద్దరాముడూ బయటుపడ్డారు. పెద్దమాధవుడికి మాలతి నచ్చింది గాని మంజరి కర్కశపు సంభాషణ కొంచెం కూడా నచ్చలేదు. పెద్దరాముడికికూడా గంగ గయ్యాళి వేషాలు చూస్తే చాలా అసహ్యం కలిగింది. వారిద్దరూ కొద్ది దూరం వచ్చారో లేదో ఒక కంసాలి ఎదురుపడి, పెద్దమాధవుణ్ణి చూసి చిన్నమాధవుడనుకుని, "మాధవుడుగారూ, మీకోసమే వస్తున్నాను. మీరు



తయారుచెయ్యమన్న గొలుసు ఇదుగో, తీసుకోండి," అంటూ అతని చేతిలో ఒక బంగారు గొలుసు పెట్టాడు. పెద్ద మాధవుడు నివ్వెరపోయి, "ఏమిటిది? దీన్ని నాకెందు కిస్తున్నారు?" అని అడిగాడు.

కంసాలి నవ్వి, "అప్పుడే మరిచారా? మీరు నన్ను ఈ గొలుసు తయారు చెయ్యమని అడిగితిరిగా? తీసుకోండి, డబ్బు తరవాత ఇద్దురుగాని!" అంటూ అక్కణ్ణించి వెళ్లిపోయాడు.

పెద్దమాధవుడు పెద్దరాముడికేసి తిరిగి, "రామా, మనం ఈ పాపిష్టి ఊళ్లో ఒక్క క్షణంకూడా ఉండవద్దు. వెంటనే బసకు

వెళ్లి నా సామానంతా రేవుకు తీసుకుపద. పడవ చేసుకుని వెళ్లిపోదాం!" అన్నాడు.

కంసాలి పెద్దమాధవుడికి నగ ఇచ్చిన కొద్దిసేపటికల్లా బాకీదార్లు వచ్చి అతనిని రాజభటులకు పట్టిఇచ్చారు. అదే సమయానికి చిన్నమాధవుడు అటుగా వచ్చాడు. అతన్ని చూసి కంసాలి, "సమయానికి దేవుడల్లే వచ్చారు. ఇందాక నేను మీకిచ్చిన బంగారుగొలుసు తాలూకు పైకం ఇప్పిస్తిరా వీళ్ల బాకీ తీర్చి బయటపడతాను!" అన్నాడు.

చిన్నమాధవుడు నిర్ఘాంతపోయి, "నువు నాకు బంగారుగొలుసు ఎక్కడ ఇచ్చావు? శుద్ధ అబద్ధం!" అన్నాడు. ఎన్ని గుర్తులు చెప్పినా చిన్నమాధవుడు గొలుసు తీసుకున్నట్టు ఒప్పుకోకపోవటం చూసి కంసాలి రక్షకభటులతో, "నాదగ్గిర నగ తీసుకుని దాని ఖరీదు ఎగవేయాలని చూస్తున్నందుకు ఈ పెద్దమనిషినికూడా నాతోపాటు పట్టుకోండి!" అన్నాడు.

రాజభటులు చిన్నమాధవుణ్ణికూడా పట్టుకున్నారు. వారు కంసాలినీ, చిన్నమాధవుణ్ణీ జైలుకు తీసుకుపోతూండగా పెద్దరాముడు వచ్చాడు. సామానంతా రేవు చేరిందనీ, పడవ బయలుదేరటానికి సిద్ధంగా ఉందనీ తన యజమానితో చెప్పటానికే వాడు వచ్చాడు. అయితే చిన్నమాధవుడు వాణ్ణి



చూసి తన నౌకరే అని భ్రమపడి, "ఒరే నువు మన ఇంటికి వెళ్ళి, అమ్మగారి నడిగి అయిదువందల వరహా లిమ్మన్నానని పట్టుకురా," అన్నాడు.

ఆ మనిషి తన యజమాని కాడని పెద్దరాముడికి తెలియదు. మళ్ళీ ఆ దిక్కుమాలిన ఇంటికి తనను యజమాని ఎందుకు పొమ్మంటున్నదీ వాడికి బోధపడలేదు. వాడు పైకి ఏమీ అనక, "యజమానులు ఏం చెయ్యమన్నా చెయ్యాలిసిందే, పాపిష్టి బతుకు!" అని గొణుక్కుంటూ తాము భోజనం చేసిన ఇంటికి బయలుదేరాడు. పెద్దరాముడు తన భర్తను రాజభటులు పట్టుకున్నారని చెప్పగానే మంజరి అయిదు వందల వరహాలూ ఇచ్చేసింది. పెద్దరాముడు ఆ సొమ్ము తీసుకుని వస్తూండగా వాడి అసలు యజమాని అయిన పెద్దమాధవుడు కనిపించాడు. పెద్దమాధవుడికి అంతా కలలాగా ఉన్నది. వీధివెంట పోతుంటే అందరూ అతన్ని పలకరించేవారే. కొందరు తనకు డబ్బు బాకీ ఉన్నామని చెప్పారు. ఒక బట్టలకొట్టువాడు అతనిని పిలిచి, "తమ కోసమే ఈ పట్టుతానులు తెప్పించాను!" అని కొన్ని తానులు చూపించాడుకూడా! ఇదంతా చూసి పెద్దమాధవుడు ఈ నగరంలో వారందరికీ మతులు పోయాయని





నిశ్చయించుకున్నాడు. మిగిలినవాళ్లకు మతి పోవటం అటుంచి తన నౌకరయిన పెద్ద రాముడికికూడా పూర్తిగా మతిపోయినట్టు కనిపించింది. ఎందుచేతనంటే వాడు తనను చూడగానే, "రాజభటులు వదిలేశారా, బాబూ? మరి బాకీ ఎలా రద్దయింది? అందుకోసం సొమ్ము తెస్తున్నానే!" అంటూ వరహాల సంచీ చూపించాడు. పెద్దమాధవుడు ఈ మాటకు జవాబు చెప్పక ఆకాశం కేసి చూసి, "ఈశ్వరా, నాకుకూడా మతి పోకుండా కాపాడు!" అన్నాడు.

తన భర్త ఎంతసేపటికీ తిరిగి రాక పోవటం చూసి మంజరి జైలువద్దకు వెళ్లింది.



అక్కడ ఆమె డబ్బు చెల్లించి తన భర్తను విడిపించుకున్నది. చిన్నమాధవుడు ఆమెపై అనేక నిందలు వేశాడు. భోజనంవేళకు తనను లోపలికి రానివ్వలేదన్నాడు, రాజభటులనుంచి బయటపడటానికి డబ్బు వెంటనే పంపలేదన్నాడు. ఈ మాటలన్నీ వింటుంటే మంజరికి తన భర్త పిచ్చివాడయి పోయాడని అనుమానం కలిగింది. తమ నౌకరు రాముడుకూడా తన యజమాని చెప్పిన మాటలన్నీ నిజమన్నాడు. అందుచేత ఆమె వాళ్లిద్దరినీ పెడరెక్కలు విరిచి కట్టి ఇంటికి తీసుకుపోయి, ఇంటి వెనక భాగంలో ఉన్న చీకటికొట్టులో పెట్టించి వైద్యుడికోసం కబురు చేసింది.

మరి కొద్దిసేపటికల్లా నౌకర్లు కొందరు మంజరివద్దకు వచ్చి, "అమ్మా, అయ్యగారూ, రాముడూ తప్పించుకుపోయినట్టుంది. పక్క వీధిలో వాళ్లు ఎవరితోనో మాట్లాడుతున్నారు!" అని చెప్పారు. ఈమాట వింటూనే మంజరి కొందరు నౌకర్లను సహాయం తీసుకుని పక్కవీధికి వెళ్లింది. అక్కడ పెద్దమాధవుడూ, పెద్దరాముడూ, కంసాలీ మాట్లాడుకుంటున్నారు.

పెద్దమాధవుడి మెడలో కంసాలి ఇచ్చిన గొలుసున్నది.





"ఏం, బాబూ? గొలుసు తీసుకుని లేదంటివే! నాసొమ్ము అప్పుడే నాకు పారేస్తే మన కింత తిప్పలుండేవికావుగా?" అంటున్నాడు కంసాలి.

"నిన్ను నేను గొలుసు ఇమ్మన్నానా? నీఅంతట నువే ఇచ్చి చక్కాపోయావు. నీతో నేను గొలుసు తీసుకోలేదన్నదెప్పుడూ? ఆ పోయినవాడివి ఇప్పుడేగా మళ్లీ కనిపిస్తున్నావూ?" అంటున్నాడు పెద్ద మాధవుడు కోపంగా.

"ఆయన తప్పించుకుని ఇక్కడికి వచ్చారు! పట్టి పెడరెక్కలు విరిచి ఇంటికి తీసుకు పదండి! ఆ రాముణ్ణికూడా!" అంటూ మంజరి వారిని సమీపించింది.

తమకేదో ప్రమాదం రాబోతుందని పెద్ద మాధవుడూ, పెద్దరాముడూ ఆ సమీపంలోనే ఉన్న ఆశ్రమంలోకి పారిపోయారు. ఆ ఆశ్రమం ఒక యోగినిది. బయట కలకలం విని ఆ యోగిని వచ్చింది. తన భర్తకు మతిపోయిందనీ, అతను తననుంచి తప్పించుకుని ఆశ్రమంలోకి వచ్చాడనీ, అతన్ని తనపరం చెయ్యమనీ మంజరి యోగినితో చెప్పుకున్నది.

"నీ భర్త ఇంకెవరినన్నా ప్రేమించటంచేత మతిపోయిందా? లేక డబ్బు పోగొట్టు



కున్నాడా? ఏం జరిగింది?" అని యోగిని మంజరిని అడిగింది.

"ఇంకెవతెనో ప్రేమించటంవల్లనే మతిపోయింది! నేను మొదటినుంచీ అనుమానిస్తూనే ఉన్నాను!" అన్నది మంజరి.

"తెలిసినదానివి భర్తను మందలించుకోవద్దా?" అన్నది యోగిని.

"అయ్యో, మందలించకేం, తల్లీ? ఎప్పుడూ చెప్పుతూనే ఉంటాను. ఇంటో ఉన్నంతసేపూ నేను నోటికి తాళం వేసుకోను. అన్నం తినేటప్పుడుకూడా మందలిస్తూనే ఉంటాను! అంతా బూడిదలో పోసిన పన్నీరయింది," అన్నది మంజరి.



మంజరి ఎలాటి భార్యో యోగిని అర్థం చేసుకున్నది. ఆమె పెద్దమాధవుణ్ణి మంజరి పరం చెయ్య నిరాకరించింది. ఈ ఘర్షణ జరుగుతూండగా రాజభటుడి వెంట ధన పాలుడు అక్కడికి వచ్చాడు. ఆయనకు ఆ నగరంలో ఎరిగినవారూ, డబ్బిచ్చేవారూ కనిపించనే లేదు.

ఆయన ఆశ్రమంవద్దకు వచ్చేసరికి, చీకటికొట్టునుంచి తప్పించుకుని చిన్న మాధవుడూ, అతని నౌకరూకూడా వచ్చారు. చిన్నమాధవుణ్ణి చూడగానే ధనపాలుడు ఆపేక్షగా పలకరించి, "మీ తమ్ముణ్ణి వెతుకుతూ ఇక్కడికి చేరావా, నాయనా? ఈ రాజభటుడు నన్ను పట్టుకున్నాడు, వెయ్యి వరహాలు చెల్లించి నన్ను ముందు వీళ్లబారి నుంచి విడిపించు!" అన్నాడు.

"అయ్యా, తమరెవరో నేనెరగను!" అన్నాడు చిన్నమాధవుడు. అతను ఎన్నడూ తన తండ్రిని చూసి ఉండలేదాయె. "నేను అంత మారిపోయానుట్రా, మాధవా?" అంటూ ధనపాలుడు గుర్తులు చెబుతున్న సమయంలో ఆశ్రమం లోపలినుంచి పెద్ద మాధవుడూ, పెద్దరాముడూ, యోగినీ అక్కడికి వచ్చారు.

తన భర్తలలాటివాళ్ళు ఇద్దరు ఒక్కసారి కనబడేసరికి మంజరి నివ్వెరపోయింది. ఆ తరవాత జరిగినదానికి కారణాలు సులువుగా బోధపడ్డాయి. యోగిని ధనపాలుడి భార్యేనని బయటపడింది. పసిపిల్లలుగా విడిపోయిన కవలలు ఇంత కాలానికి తిరిగి కలుసుకున్నారు. పెద్దమాధవుడుకూడా రాజుగారివద్ద కొలువు సంపాదించి మాలతిని వరించి పెళ్ళి చేసుకున్నాడు. వారిద్దరి అన్యోన్య దాంపత్యాన్ని చూసి మంజరి తన భర్తను సూటిపోటిమాట లనటం మానేసింది. ధనపాలుడు రుద్రపురంలోనే స్థిర పడి తన భార్యతోనూ, పిల్లలతోనూ, వారి నౌకర్లతోనూ సుఖంగా ఉన్నాడు.





# ఉత్తుత్త విందు

పూర్వం బాగ్దాదునగరంలో ఒక సంపన్నుడైన వృద్ధుడుండేవాడు. ఆయనకు నగరంలో ఒక రాజభవనంలాటి ఇల్లూ, దాని ముందు రమ్యమైన పూలతోటా, ఇంటి నిండా మఖ్మల్ పరిచిన ఆసనాలూ ఉండేవి. ఆయనకు ఎందరో నౌకర్లూ చాకర్లూ ఉండేవారు. అయినా ఆయన మనస్సు క్రూరమైనది. పేదసాదలనూ, అనాథలనూ మానసికంగా హింసించటం ఆయనకు పెద్ద సరదా.

ఒకనాడాయన వరండాలో మెత్తలపై కూచుని ఉండగా తిండికి లేని నిర్భాగ్యుడొకడు వచ్చి ఆయనముందు వంగి సలాం చేశాడు. ఈ నిర్భాగ్యుడి పేరు షక్కాషిక్. వాడు తన తండ్రి పోయిననాటినుంచీ తిండి కోసం వీధులవెంట ముష్టి ఎత్తుతున్నాడు. ముసలివాడు వాణ్ణి చూసి అప్యాయంగా, "నీకు ఏం సహాయం కావాలి, నాయనా?" అని అడిగాడు. "బాబూ, కాస్త ధర్మం చెయ్యండి. రెండు రోజులుగా తిండి లేదు, డొక్క మాడిపోతున్నది," అన్నాడు షక్కాషిక్.

ముసలివాడు ఉద్రేకంతో, "అరే అల్లా! ఏమన్నావూ? నేను ఈ నగరంలో బతికి ఉండగానే ప్రజలు తిండిలేక అలమటించటమా? అలా జరిగేందుకు వీలులేదు. నేను సహించను," అన్నాడు.

"పదితరాలపాటు తమరు చల్లగా ఉండాలి, బాబూ. ఈ ఆకలిబాధ ఇంక సహించలేకుండా ఉన్నాను," అన్నాడు షక్కాషిక్.

"ఇంకేం? నువు ఈ పూట ఇక్కడే ఉండి నాతోపాటు భోంచేద్దువుగాని!" అంటూ ముసలివాడు ఒక కుర్రవాణ్ణి పిలిచి, చేతులు కడుక్కునేటందుకు నీరు సిద్ధం చెయ్యమన్నాడు. తరవాత ఆయన

వి. సత్యనారాయణ

పక్కకు వెళ్లి ఉత్తుత్త కూజాలోనుంచి చేతులమీద నీరుపోసి కడుక్కుంటున్నట్టు నటిస్తూ, "నువుకూడా చేతులు కడుక్కో!" అన్నాడు షక్కాషిక్‌తో. ఆయున తన చేతులు తడిసినట్టుగానూ, వాటిని తుడుచుకుంటున్నట్టుగానూ నటించాడు.

ఈ నటన ఏమిటో షక్కాషిక్ అర్థం చేసుకోలేకపోయాడు.

ముసలివాడి హాస్యధోరణికి లోలోపల ఆనందిస్తూ వాడుకూడా చేతులు కడుక్కున్నట్టు అభినయించాడు.

"ఒరే, బల్లమీద గుడ్డ పరిచి వేగిరం భోజనం వడ్డించండి. పాపం, ఈ నిర్భాగ్యుడు చాలా అకలిమీద ఉన్నాడు," అని ముసలివాడు తన నౌకర్లను కేకవేశాడు.

వెంటనే అనేకమంది నౌకర్లు అదరాబాదరా వచ్చారు. కొందరు బల్లమీద గుడ్డ పరుస్తున్నట్టు నటించారు. మరికొందరు కంచాలు పెడుతున్నట్టూ, అహారపదార్థాలు తెస్తున్నట్టూ నటించారు. షక్కాషిక్‌కు ఆకలి దహించుకుపోతున్నా ఈ నాటకమంతా సహించి ఊరుకున్నాడు. ధనికుల సరదాలను విమర్శించటం దరిద్రుడికి ప్రమాదమని వాడికి తెలుసు.

"కూర్చో, తమ్ముడూ! ప్రారంభించు!" అంటూ ముసలివాడు తన ముందున్న



పదార్థాలను విడివిడిగా రుచిచూసినట్టు అభినయించి దవడలు ఆడించసాగాడు.

"మొహమోట పడకు. నీకు కావలసి నంత హాయిగా తిను. ఇదుగో, ఈ రొట్టె చూశావా? ఎంత తెల్లగా ఉన్నదో!" అన్నాడు ముసలివాడు.

"ఇంత తెల్లని రొట్టె నేనెన్నడూ తిన లేదు. దీని రుచికూడా అద్భుతం," అంటూ షక్కాషిక్ తానుకూడా తినటం అభిన యించాడు.

ముసలివాడు ఆ రొట్టెను చేసిన నీగ్రో మనిషిగురించీ, ఆమెకు తానిచ్చే డబ్బు గురించీ చెప్పాడు; తమ ఎదట ఉన్న కూరలనూ, మాంసాలనూ వర్ణించాడు, వాటి రుచినీ, వాసననూ మెచ్చుకున్నాడు. ఆ వర్ణన వింటున్నకొద్దీ షక్కాషిక్‌కు ఆకలి మరింత అవుతున్నది.

మామూలు భోజనం అయిపోయాక ముసలివాడు మిఠాయీలూ, హల్వాలూ తెమ్మని కేక పెట్టాడు. నౌకర్లు వాటిని తెచ్చి పెట్టినట్టు నటించారు.

ముసలివాడు వెనకటిలాగే వాటిని వర్ణించి, పొగడి, వాటి రుచిని గురించి తన అభాగ్యపు అతిథిని ప్రశ్నించాడు.

ఆ తరవాత ముసలివాడు పళ్లనూ, పానీ యాలనూ తెమ్మన్నాడు. నౌకర్లు బల్లమీద



ఉన్న పళ్ళాలన్నిటినీ తీసుకుపోయినట్టు నటించి, షర్బతులూ, సారాలూ తెచ్చినట్టు అభినయించారు.

"తాగు, నాయనా! ఇలాటి షర్బతు ఎక్కడా లేదు. ఈ సారా చూశావా? చాలా పాతది! తాగు! సుఖంగా తాగు!" అని ముసలివాడు తన అతిథిని ప్రోత్సహించుతూ, అతని నోటికి గ్లాసులు అందించినట్టు అభినయించాడు.

ఇంతసేపూ ఈ ముసలివాడి నటనను సహించి ఊరుకున్న షక్కాషిక్ ఇక ఊరుకోలేకపోయాడు. వాడు చివాలున లేచి ముసలివాడి మెడమీద తన చేత్తో దభాల్న ఒక్కటి పెట్టాడు. ఆ దెబ్బకు ఇల్లంతా ఒక్కసారి మారుమోగింది.

ముసలివాడు ఆగ్రహంతో, "ఏం చేస్తున్నావురా, చండాలుడా?" అని అరిచాడు.

"యజమానీ, నేను నీ బానిసను! కాని నువ్వు నాచేత ఆ ఘాటైన సారా తాగించకుండా ఉండవలసింది. అలవాటు లేక నాకు నిషా ఎక్కిపోయింది!" అన్నాడు.

ఈ మాటకు ముసలివాడు విరగబడి నవ్వుతూ, "ఓరి, పిడుగా! నేనిలా ఎందరినో ఏడిపించాను. ఒక్కడుకూడా నువ్వు చూపినంత ఓర్పు చూపలేదు. నీకున్న హాస్యధోరణికూడా నేనెవరిలోనూ చూడలేదు. నాకు మంచి పాఠమే చెప్పావు. కూచో! అసలు విందు రప్పిస్తాను!" అన్నాడు.

ఈసారి నిజమైన ఆహారపదార్థాలే బల్ల మీదికి వచ్చాయి. అంతకుముందు ముసలివాడు ఏయే పదార్థాలను వర్ణించాడో అవన్నీ షక్కాషిక్ ఈసారి ప్రత్యక్షంగా తిని ఆనందించాడు.

అది మొదలు షక్కాషిక్ తిండికి మాడలేదు. ఎందుచేతనంటే తాను బతికి ఉన్నన్నాళ్లూ ముసలివాడు వాణ్ణి రెండు పూటలా తన సరసను కూచోబెట్టుకుని భోజనం చేశాడు.






## 17

[ తనను పెళ్ళాడమని వేధించే యువకులలో ఎవరైనా తన భర్త బాణాన్ని ఎక్కుపెట్టి, తన భర్తలాగా పన్నెండు గొడ్డలి తలలకుండా బాణం కొట్టగలిగితే అలాటి మనిషిని పెళ్ళాడటానికి పద్మముఖి నిశ్చయించుకున్నది. ముసలి బిచ్చగాడి రూపంలో వచ్చిన తన భర్తను గుర్తించక ఆమె ఈ నిశ్చయాన్ని ఆయనతోనే చెప్పేసింది. మర్నాడు ఈ విషయాన్నే ఆమె తన యింట పడి తింటున్నవారికికూడా చెప్పి, రూపధరుడి విల్లునూ, బాణాలనూ తెచ్చి వారి ఎదట ఉంచింది.]

ఒక్కొక్కరే వంతుప్రకారం వచ్చి ధనుస్సుకు నారి సంధించే ప్రయత్నం చేసి ఓడిపోసాగారు. ఇది చూసి దుర్బుద్ధి, కాళుణ్ణి పిలిచి, "ఒరే, ఈ విల్లుకు కొవ్వు రాచి నిప్పుదగ్గిర కాచు!" అన్నాడు. కాళుడు అలాగే చేశాడు. కాని అందువల్ల ఏమాత్రం ప్రయోజనం లేకపోయింది. ఈ విధంగా ధనుస్సుతో దుర్మార్గులు సతమతమవుతూ ఉన్న సమయంలో పందులకాపరీ, పశువులకాపరీ బయటికి వెళ్ళారు. ఇది గమనించి రూపధరుడుకూడా బయటికి వెళ్ళాడు. అతను వారిని దగ్గిరికి పిలిచి రహస్యంగా "నేను చెప్పేది శ్రద్ధగా వినండి. మీ యజమాని అయిన రూపధరుడు వస్తే మీరు అతనికి ఏమి సహాయం చేస్తారు ? ఆ లోపల ఉన్న వాళ్ళందరినీ ఎదిరించి అతని పక్షాన







పోరాడతారా? దాపరికం లేకుండా నిజం చెప్పండి," అన్నాడు.

పోరాడతామని ఇద్దరూ ప్రమాణాలూ, శపథాలూ చేసినాక రూపధరుడు వారితో, "నేనే రూపధరుణ్ణి! నేను తిరిగి వచ్చినందుకు సంతోషించేవారు మీరిద్దరే నాకు కనబడుతున్నారు. దేవుడి దయవల్ల నేను నా శత్రువులను నాశనం చెయ్యగలిగితే మీకు గొప్ప బహుమానా లిస్తాను—పొలా లిస్తాను, ఇళ్ళిస్తాను. నేను రూపధరుణ్ణి కాదని అనుమానం ఉంటే ఈ మచ్చ చూడండి!" అంటూ అతను తన కాలిమీది మచ్చ చూపాడు.



ఇద్దరు సేవకులూ తమ యజమానిని చూసి ఆనందబాష్పాలు రాల్చారు.

"ఇప్పుడు సంతోషానికీ, కన్నీరుకూ వ్యవధి లేదు. నేను ముందు లోపలికి పోతాను. తరవాత మీరిద్దరూ ఒక్కొక్కరుగా రండి. నేను విల్లుకోసం అడుగుతాను. వాళ్ళు ఇవ్వరు. అప్పుడు పందులకాపరి ఆ విల్లు తెచ్చి నాచేతి కివ్వాలి, తరవాత ఆడవాళ్ళుండే చోటికి వెళ్ళి వాళ్ళు తమ గదులలోకి వెళ్లి తలుపులు బిగించుకోవాలనీ, గడబిడ జరిగినా బయటికి రాగూడదనీ హెచ్చరిక చెయ్యాలి. సుఖప్రాప్తీ, నువు బయటికి వెళ్ళి సింహద్వారం బంధించాలి. తెలిసిందా?" అన్నాడు రూపధరుడు.

తరవాత ఆ ముగ్గురూ ఒకరి తరవాత ఒకరుగా లోపలికి వెళ్లి తమ స్థానాలలో కూచున్నారు. ఈ సమయానికి విపుల యోధుడు ధనుస్సుపైన తన బలం చూపుతున్నాడు. దానిని వంచటం అతనివల్ల కాలేదు. అతను నిరాశతో మూలిగి, "మనం ఎంత దౌర్భాగ్యులం! పెళ్లిమాట అటుంచండి, పెళ్లాడాలంటే ఈవిడ కాకపోతే ఇథకానిండా ఆడవాళ్లున్నారు. కాని రూపధరుడితో పోల్చితే మనం ఇంత బలహీనులమా అని నాకు విచారంగా ఉన్నది.





మన తరంవాళ్లను చూసి రాబోయే తరాల వాళ్లు ఏమనుకుంటారు?" అన్నాడు.

దుర్బుద్ధి ఈ మాటలకు, "చాదస్తంగా మాట్లాడకు. ఇవాళ పర్వదినం. మనం ధనుస్సులజోలికి పోనేకూడదు. దాన్ని అలా పెట్టెయ్యి, మరొకనాడు దాని సంగతి చూడవచ్చులే!" అన్నాడు.

ఈ మాట అందరికీ నచ్చింది. అందరూ భోజనాలు ముగించాక రూపధరుడు, "అయ్యలారా, ఆ విల్లు ఒకసారి నా చేతికి ఇప్పిస్తారా? ఇవాళకు మీరు దాని జోలికి పోవటంలేదుగద! నా బలం ఏపాటి అయినదీ చూస్తాను. అయినా నా బలం ఏనాడో హరించిందిలే!" అన్నాడు.

అందరికీ ఆగ్రహం వచ్చింది. ఆ ముసలివాడు విల్లును వంచుతాడేమోనని వారికి భయంకూడా కలిగింది. దుర్బుద్ధి కోపంతో, "నీచుడా, నీకేమైనా మతి పోయిందా? సారా తలకెక్కినట్టుందే? నిజంగా నువ్వా ధనుస్సు వంచితే నీ ప్రాణాలు దక్కుతాయనుకున్నావా?" అన్నాడు.

"దుర్బుద్ధీ, నా కొడుకు తెచ్చిన అతిథికి ధనుస్సు ఎందుకు నిరాకరిస్తున్నావు? ఆయన విల్లు వంచేసి నన్ను పెళ్లాడతానంటాడనా నీ భయం? అలాటి ఉద్దేశం ఆయన



కున్నదని ఎందు కనుకోవాలి?" అన్నది పద్మముఖి కోపంగా.

"మాకలాటి భయమేమీ లేదు, దేవీ. కాని మేము వంచలేకపోయిన వింటిని ఈ నామరూపాలు లేని ముసలివాడు వంచి గొడ్డలితలలకుండా బాణం కొట్టాడనుకో, మాకందరికీ ఎంత అవమానం!" అన్నాడు విపులయోధుడు.

"అమ్మా, నీకీ గొడవలన్నీ దేనికి? నేనీ విల్లును నా యిష్టం వచ్చినవాడికి దానం ఇచ్చినా నన్ను అడగగల మగవాడీ దేశంలో లేడు, సరేనా? నువు వెళ్లి నీ పని చూసుకో!" అన్నాడు ధీరమతి.





ఈ మాటలు పద్మముఖికి ఆశ్చర్యమూ, ఆనందమూకూడా కలిగించాయి. తన కొడుకు సమర్థుడవుతున్నాడని సంతోషిస్తూ ఆమె తన గదికి వెళ్లిపోయింది.

ఈ లోపల పందులకాపరి ధనుస్సును తీసుకుని రూపధరుడివద్దకు బయలు దేరాడు. ఇది చూసి అందరూ గోలగా అరిచారు. వాళ్ల అరుపులకు పందులకాపరి బెదిరి విల్లు కింద పడేశాడు. కాని ధీరమతి అతన్ని ప్రోత్సహించి, "వాళ్ల వాగుడుతో నీకేమిటి? నీ పని నువు చెయ్యి," అన్నాడు.

పందులకాపరి ధనుస్సును రూపధరుడి కిచ్చి స్త్రీలుండే చోటికి వెళ్లి, బహుకీర్తితో, "చిన్నబాబుగారు చెప్పమన్నారు, ఆడ వాళ్లంతా గదుల్లోకి పోయి తలుపులు వేసు కోవాలట; గడబిడ జరిగినా బయటికి రాకూడదట!" అన్నాడు. ఇదంతా ఏమిటో ఆమెకు బోధపడలేదు, అయినా ఆమె పందులకాపరి చెప్పినప్రకారం ఏర్పాటు చేసింది. సుఖప్రాప్తి చల్లగా బయటికి జారు కుని తలవాకిలి బంధించివచ్చాడు.

ఈలోపుగా రూపధరుడు విల్లును తన చేత పట్టుకుని అటూ ఇటూ తిప్పి పరీ క్షించాడు. అందరి కళ్ళూ అతనిపైనే ఉన్నాయి. "బాణాల సంగతి తెలిసిన వాడల్లే నే కనబడుతున్నాడు...అటువంటి



బాణం చెయ్యాలని చూస్తున్నాడులాగుంది... దానికి తాడు తగిలించి బావుకునేదేమిటో బావుకోనీ!" అంటూ వాళ్లు రకరకాలుగా వ్యాఖ్యానించారు.

రూపధరుడు ధనుస్సును పరీక్షించటం పూర్తిచేసి, సునాయాసంగా దానికి తాడు తగిలించి, ధనుస్సును కుడిచేత పట్టుకుని ఎడమచేత తాడు మీటాడు. అది చక్కని నాదంచేసింది. అందరూ దిగ్భ్రమచెందారు. రూపధరుడు ఒక మంచి బాణాన్ని అంబుల పొదినుంచి తీసి ఎక్కుపెట్టి గురిచూసి అన్ని గొడ్డలితలలకుండానూ దూసుకు పోయేటట్టు కొట్టాడు.

తరవాత అతను తన కొడుకుతో, "నాయనా, ధీరమతీ! నేను నీకు అప్రతిష్ఠ తీసుకురాలేదు. అవలీలగా వింటికి తాడు తగిలించాను, గురిగా బాణం కొట్టాను. ఈ పెద్దమనుషులు ఏమంటే ఏం గాక, నా బలం తగ్గలేదు. చీకటి పడబోతున్నది. ఈ పెద్దలకు రాత్రిభోజనం సిద్ధంచేయించు. తరవాత క్రీడావినోదాలూ, నృత్యగానాలూ ఉండనే ఉన్నాయి," అంటూ సైగచేశాడు.

వెంటనే ధీరమతి ఒకచేత కత్తీ, ఇంకొక చేత పదునైన ఈటె తీసుకుని తన తండ్రి పక్కనే వచ్చి నిలబడ్డాడు. రూపధరుడు తన చింకిగుడ్డలు తీసి ఎడంగా పారేసి





ఒక్క గంతుతో వెళ్లి గడపమీద నిలబడి మిగిలిన బాణాలను తన కాళ్ళవద్ద నేల మీద పరిచి, "అసలు ఆట ఆరంభ మయింది. నే నీసారి ఇంకొక గురి కొట్ట బోతున్నాను. దాన్ని ఎవరూ లోగడ కొట్టి ఉండలేదు!" అంటూ బాణం ఎక్కుపెట్టి దుర్బుద్ధికేసి కొట్టాడు.

ఆ బాణం తనకు తగులుతుందని దుర్బుద్ధిగాని మిగిలినవారుగాని కలలో కూడా ఊహించలేదు. దుర్బుద్ధి పెద్ద కూజాలో ఉన్న సారాయిని రెండు చేతులా ఎత్తి తాగుతుండగా బాణం వచ్చి అతని కంఠంలో గుచ్చుకున్నది. కూజా అతని చేతిలోనుంచి కింద పడింది, అతను పక్కకు పడిపోయాడు.

మరుక్షణం హాహాకారాలు చెలరేగాయి. అందరూ తమ ఆసనాలమీదినుంచి లేచి ఆయుధాలకోసం గోడలకేసి చూశారు. గోడ లన్నీ బోడిగా ఉన్నాయి.

"మనిషిని కొడతావురా, దుర్మార్గుడా! చూడు నీ ప్రాణాలు తీస్తాం!" అని వారు రంకెలు పెట్టారు.

అప్పటికికూడా వారు నిజం గ్రహించ లేదు. ఆ బిచ్చగాడు ప్రమాదవశాన దుర్బుద్ధిని కొట్టాడనే వారి నమ్మకం.

రూపధరుడు కనుబొమలు ముడేసి వారితో ఇలా అన్నాడు:

"కుక్కల్లారా, నేను ట్రోయ్‌నుంచి తిరిగి రానని ఆశపడ్డారు. ఆ ధైర్యంతోనే మీరు నా ఇంటిపై పడి నా సొత్తంతా తినేశారు, నా దాసీలను మీ ఉంపుడుగత్తెలు చేసుకున్నారు, నేను బతికి ఉండగానే నా భార్యను పెళ్లాడ టానికి సిద్ధపడ్డారు. మీకు దైవభీతి లేదు, నా భయమూ లేదు. యమపాశాలు మీ కంఠాలకు తగులుకున్నాయి!" అన్నాడు.

భయంతో ఎవరి నోటా మాట రాలేదు విపులయోధుడుమాత్రం, "నువు నిజంగా రూపధరుడివే అయితే నీ మాటలలో నిజం



ఉన్నది. మావల్ల చాలా అక్రమాలు జరిగాయి. వీటికన్నిటికీ మూలకారకుడు దుర్బుద్ధి. వాడు కేవలం భార్యకోసం ఇక్కడికి రాలేదు. నీ కొడుకును చంపి ఆస్తి కాజెయ్యాలనే దుర్బుద్ధితో వచ్చాడు. నీకు నష్టపరిహారం చేస్తాం; తాగిన సారా అంతా ఇచ్చేస్తాం, చందాలు వేసుకుని డబ్బు పోగు చేస్తాం, తలకు ఇరవై ఎద్దుల వంతున ఇచ్చుకుంటాం. నష్టపరిహారం ముట్టేదాకా నీకు మాపైన ఆగ్రహించే అధికారం ఉన్నది!" అన్నాడు.

"దుర్మార్గులారా మీరు చేసిన ఆకతాయితనానికి ఒకటే పరిహారం—మీ ప్రాణాలు. మీలో ప్రతిఒక్కడి ప్రాణాలూ పుచ్చుకుంటాను. మీకు పారిపోయే అవకాశం కూడా లేదు," అన్నాడు రూపధరుడు.

విపులయోధుడు తన అనుచరులతో, "అన్నలారా, ఇతను తెగబడ్డాడు. కత్తులు దూసి అందరమూ ఒక్కసారిగా కలియబడదాం పట్టండి. ఎంతమందినని చంపగలడు! మనం వీధిలోకి వెళ్లి కేక పెట్టామంటే అందరూ వస్తారు, వీడి ఆట కట్టవుతుంది!" అన్నాడు.

ఇలా అంటూనే అతను కత్తి దూసి ఒక పెడబొబ్బతో రూపధరుడివేపు లంఘించాడు.



మరుక్షణం రూపధరుడి బాణం అతని ఛాతిలో దిగబడిపోయింది.

మిగిలినవాళ్ళుకూడా రూపధరుడిపైకి కలియబడ వచ్చారు. కొందరిని ధీరమతి తన ఈటెతో పడగొట్టాడు. తరవాత అతను తండ్రితో, "నాన్నా, నీకూ పందులకాపరికీ, పశువులకాపరికీ ఆయుధాలు తీసుకు వస్తాను!" అన్నాడు.

"బాణాలు అయిపోకముందే పట్టుకురా!" అన్నాడు రూపధరుడు. ధీరమతి సామాన్ల గదికి వెళ్ళి నాలుగు డాళ్ళూ, ఎనిమిది ఈటెలూ, నాలుగు శిరస్త్రాణాలూ తీసుకుని క్షణంలో తిరిగివచ్చాడు.

వీటిని నలుగురూ ధరించి వాకిలికి అడ్డంగా నిలబడ్డారు.

బాణాలు అయిపోయాక రూపధరుడు విల్లును అవతల పెట్టి, ఈటెలు పట్టాడు. అప్పటికి కొందరు చచ్చారుగాని ఇంకా కొందరు మిగిలి ఉన్నారు. ఈ సమయానికి కాళుడు తన యజమానులకు సహాయం చేశాడు. వాడు వెనకదారిన వెళ్లి సామాన్ల గదినుంచి ఒక డజను ఈటెలూ, డజను డాళ్ళూ తెచ్చి అందరికీ పంచిపెట్టాడు.

ఈ సంగతి గమనించి రూపధరుడు, "ధీరమతీ, వాళ్ళకి ఇంట్లో దాసీలెవరో సహాయం చేస్తున్నారు!" అన్నాడు.

"తప్పు నాదే, నాన్నా! సామాన్లగది తలుపు తాళం వెయ్యటం తొందరలో మరిచాను!" అంటూ ధీరమతి, పందులకాపరిని వెళ్లి సామాన్లగది మూసిరమ్మని పంపాడు. రెండవసారి సామాన్లగదిలో ప్రవేశిస్తూ కాళుడు పందులకాపరికి దొరికిపోయాడు.

తరవాత ఉభయపక్షాలకూ ఈటెలతో యుద్ధం జరిగింది. అదృష్టవశాత్తూ శత్రువుల ఈటెలలో ఒక్కటికూడా రూపధరుడికిగాని ధీరమతికిగాని తగలలేదు. కాని వారి ఈటెలకు శత్రువులు పడిపోయారు. ఈటెలు అయిపోయాక రెండుపక్షాలవారూ దొమ్మియుద్ధానికి తలపడ్డారు.

ఆ రోజు దేవతలు రూపధరుడి పక్షాన ఉన్నారు. అతని శత్రువులందరూ చివరకు చచ్చారు. ఇద్దరినిమాత్రం అతను ప్రాణాలతో వదిలిపెట్టాడు; వారు అమాయకులు.

హాలంతా పీనుగుపెంటలతో నిండిపోయింది. రూపధరుడు ముసలిదాదిని పిలిచి, "దాసీలచేత ఈ హాలంతా కడిగి శుభ్రం చేయించు. ఈ శవాలన్నిటినీ బయటి ఆవరణలో చేర్చమని నౌకర్లకు చెప్పు," అన్నాడు. హాలు శుభ్రంగా కడిగినాక ధూపం వేయించాడు.

(వచ్చే సంచికలో ముగింపు)



# కష్ట సుఖాలు



విసుగుచెందని విక్రమార్కుడు మరొకసారి చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, శ్మశావంకేసి ఎప్పటిలాగే మౌనంగా నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, రాజులు భోగలాలసులు. వారి బుద్ధి ఎప్పుడూ కొత్త సుఖాలనే కాంక్షిస్తూ ఉంటుంది. నీలాగా ఏ రాజుకూడా శ్రమజీవితం గడపడు. కొందరు రాజులు ఉన్న సుఖాలు చాలక, కొత్తవి లభ్యంకాక ఎంతో మానసిక వ్యథ అనుభవిస్తారు. దీనికి నిదర్శనంగా నీకు సత్యజిత్తుమహారాజు కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పనారంభించాడు:

హస్తినాపురాన్ని పరిపాలించిన రాజులలో సత్యజిత్తుమహారాజొకడు. చంద్రవంశాన పుట్టిన ఈ రాజు కురుపాంచాల దేశాలను చాలాకాలం పాలించాడు. ఆయన కాలంలో



దేశం సుభిక్షంగా ఉన్నది. వానలు సవ్యంగా కురిశాయి, పంటలు చక్కగా పండాయి. ప్రజలు యుద్ధభయమూ, చోరభయమూ, అగ్నిభయమూ ఎరగరు. ధర్మం నాలుగు పాదాలా నడిచి ప్రజలు చాలా సుఖపడ్డారు.

ఇక రాజు సంగతి చెప్పనే అవసరం లేదు. ఆయన వైభోగం ఇంద్రవైభోగాన్ని మించింది. అన్నివిధాలైన సుఖాలూ ఆయన అనుభవించాడు. కాని రానురాను ఆయన మనసులో ఏదో విచారం వృద్ధి కాసాగింది. కొద్దికాలానికి ఆయనకు ఆనందించే శక్తి పూర్తిగా పోయింది. రాజవైద్యులందరూ కలిసికూడా ఆయన విచారాన్ని పోగొట్టలేక పోయినారు. మంత్రులు ఆయనను, "మహా రాజా, మీ కోరిక ఏమిటో చెప్పండి. అది ఎంత కష్టమైనప్పటికీ సాధించి మీకు ఆనందం చేకూర్చుతాము. మాదగ్గిర మీరు ఏమీ దాచవలిసినపనిలేదు," అన్నారు.

రాజు నిట్టూర్చి, "నన్ను ఏమి చూసి ఆనందించమన్నారు? జీవితం పిప్పిలాగా ఉన్నది. ఎందులోనూ నాకు కొత్తదనం కనిపించటం లేదు," అన్నాడు.

రాజుగారికి వైరాగ్యం కలిగిందనుకుని మంత్రులు కొందరు తత్వవేత్తలను రప్పించి వారిచేత వేదాంతం చెప్పించారు. కాని తత్వవేత్తల సంభాషణలు రాజుకు మరింత చిరాకు తెప్పించాయి. రాజుగారి మనో వ్యాధికి మందులే నట్టే కనబడింది.

ఇలా ఉండగా ఒకనాడు రాజభవనానికి శౌనకమహాముని వచ్చాడు. మంత్రు లాయ నతో రాజుయొక్క మనస్థితిగురించి చెప్పి, "స్వామీ, మా రాజుగారికి ఉన్న సుఖాలపై అసంతృప్తి కలిగింది. ఆయనకు కొత్త సుఖాలు కల్పించటానికి మాకు శక్తి చాల కుండా ఉన్నది. మాకేదైనా మార్గం ఉపదే శించండి!" అని ప్రార్థించారు.

శౌనకమహాముని అంతా విని తల ఊచి, "మీ రాజుకు కావలిసిన కొత్త సుఖాలు

నేను చూపుతాను. మీరేమీ చింతించ కండి!" అన్నాడు.

తరవాత ఆయన లోపలికి వెళ్లి రాజును చూసి, "రాజా, నీకొక చిన్న సహాయం చేసి పోదామని వచ్చాను. మనం మేడ పైభాగాన ఉన్న నీ రహస్య మందిరానికి పోదాం పద!" అన్నాడు.

రాజు భక్తితో శౌనకమహామునిని తన రహస్యగృహానికి తీసుకువెళ్ళాడు. అక్కడ ఇద్దరూ ఆసనాలపై కూచున్నారు.

"రాజా, ఆ దక్షిణ గవాక్షం దగ్గిరికి వెళ్లి ఏమి కనిపిస్తుందో చూడు!" అన్నాడు మహాముని.

రాజు లేచి వెళ్లి దక్షిణపు గవాక్షంకుండా చూశాడు. ఆయన గుండె ఒక్క క్షణంపాటు ఆగి గబగబా కొట్టుకోసాగింది. తన కోట వెలపల శత్రువుల గుడారాలు కనిపించాయి. లక్షలాది సైనికులు తన కోటగోడలు ఎక్కుతూ, భయంకరంగా అరుస్తున్నారు.

రాజు వెనక్కు తిరిగి, "స్వామీ, నాపైకి దేశంలో ఉన్న రాజు లందరూ దండెత్తి వస్తున్నారు!" అన్నాడు.

"వారెవరో సరిగా చూడు!" అన్నాడు ముని. రాజు మళ్లీ గవాక్షంలోనుంచి చూస్తే ఏమీ కనిపించ లేదు.



తరవాత రాజు తూర్పు గవాక్షంలోనుంచి చూస్తే యమునానది పొంగి కనుచూపుమేర దాకా దేశాన్ని ముంచివేసినట్టూ, నదీ తరంగాలు తన కోటలోకి తోసుకువస్తున్నట్టూ కనబడింది. కాని ఇంకొకసారి చూస్తే అదంతా అదృశ్యమైపోయింది.

ఆ తరవాత రాజు ఉత్తర గవాక్షంనుంచి చూసేసరికి హస్తినాపురనగరం యావత్తూ తగలబడిపోతున్నట్టు కనిపించింది. రాజు భయంతో కళ్లు గట్టిగా మూసుకుని మళ్లీ తెరిచేసరికి నగరం మామూలుగానే ఉంది.

అలాగే రాజు పడమటి గవాక్షంనుంచి కూడా చూశాడు. పచ్చని పైర్లతోనూ, పళ్ల

తోటలతోనూ కళకళలాడుతూ ఉండే ప్రదేశమంతా ఎడారిలాగా కనిపించింది. అందులో అక్కడక్కడా రాళ్లగుట్టలూ, జంతువుల ఎముకలూ కనిపించాయి. ఆ దృశ్యం చూడగానే రాజు కంట నీరు కారింది. అయన కళ్లు తుడుచుకుని మళ్లీ చూస్తే మామూలు పంటచేలూ, పళ్లతోటలూ, ఉద్యానాలూ కనిపించాయి.

రాజు గవాక్షం దగ్గిరనుంచి తన అసనం వద్దకు తిరిగివచ్చి, శౌనకమహామునితో "స్వామీ, నేను చూసిన దృశ్యాలన్నీ నిజమా, భ్రమా? అవి ఒకప్పుడు జరిగినవా, లేక ఇక జరగనున్నవా?" అని అడిగాడు.

"నాయనా, ఒకసారి జరిగినవే మళ్లీ జరుగుతాయి. నిన్న జరిగినదాన్నీ, రేపు జరగబోయేదాన్నీ ఇవాళ చూస్తే దాన్ని భ్రమ అనుకుంటాం. నీవు చూసిన దృశ్యాలు నిన్ను చాలా బాధించినట్టున్నాయి. సుఖంగా స్నానం చేసి రా," అన్నాడు ముని.

రాజు మునిని వెంటపెట్టుకుని తన క్రీడా సరస్సుకు వెళ్లాడు. ముని దాని ఒడ్డున కూర్చుని ఉండగా రాజు సరస్సులో ప్రవేశించాడు. అయన నీటిలో తల ముంచిన మరుక్షణం నీరు అల్లకల్లోలంగా ఉన్నట్టు కనబడింది. తాను మునిగినది ఒక సముద్రంలోననీ, ఆ సముద్రంలో తుఫాను



చెలరేగుతున్నదనీ రాజు గ్రహించాడు. ఆయన ఆ సముద్రంలో పడి ఈదుకుంటూ, పెద్దపెద్ద కెరటాలచేత దెబ్బతింటూ ఒక తీరాన్ని చేరుకున్నాడు. ఆయన తల ఎత్తి చూసేసరికి అక్కడ కొందరు పల్లెటూరి జనం చేరి ఆయనను వింతగా చూస్తున్నారు.

"ఏమిటలా చూస్తారు? నేను హస్తినాపుర రాజును సత్యజిత్తును. మీరంతా వెళ్లిపొండి!" అని ఆయన వారిని ఆజ్ఞాపించాడు. వాళ్లు విరగబడి నవ్వసాగారు. వారిలో ఒకడు రాజును సమీపించి, "నెత్తిన ఈ ఇత్తడి టోపీ ఏమిటి? పనికి అడ్డంగా ఈ కోక ఏమిటి?" అంటూ రాజు నెత్తిపై గల కిరీటాన్నీ, ఆయన శరీరంపై ఉన్న ఉత్తరీయాన్నీ లాగి సముద్రంలో గిరవాటు వేశాడు. "పాపం, దేశంగాని దేశంలో వచ్చిపడ్డావు. ఒళ్లు వంచి పని చేస్తే ఇక్కడ బతకలేకపోవులే! ఈ పారలూ పలుగులూ నెత్తిన పెట్టుకుని మావెంట రా. ఇవాళకు పొలంపని ముగించి ఇళ్లకు పోతున్నాం," అన్నాడు వాడు.

రాజుకు పట్టరాని కోపం వచ్చింది. కాని చేసేదేమీలేక ఆయన, "బరువులు మోయటం నాకు చాతకాదు!" అన్నాడు.

"మనిషివై ఉండి ఎద్దు చేసే పనికూడా చాత కాదంటావే?" అంటూ ఆ మనిషి





అక్కడవున్న పలుగులూ పారలూ కట్ట గట్టి రాజు నెత్తిన పెట్టాడు.

రాజు ఆ బరువు మోసుకుంటూ వాడి వెంట వాడి ఇంటికి వెళ్లాడు. వాడు తన భార్యతో, "ఒసే ఈ మనిషికి మనిషి పని చేత కాదుట. ప్రస్తుతం గొడ్డు పని నేర్చుకుంటున్నాడు. వీణ్ణి మన గొడ్ల సావిట్లో కట్టేసి ఇంత దాణా వెయ్యి!" అన్నాడు.

రాజు ఆ రాత్రి ఉలవ గుగ్గిళ్లు తిని మర్నాటికల్లా ఎద్దుగా మారిపోయాడు. ఆ రైతు రాజుచేత ఎద్దు చేసే పనులు చేయించటానికి ప్రయత్నిస్తే రాజు మొరాయించాడు. రైతుకు కోపంవచ్చి ఆ ఎద్దును కాస్తా ఒక నూనె గానుగవాడికి అమ్మాడు. గానుగవాడు ఆ ఎద్దుకు గంతలు కట్టి గానుగకు కట్టి అహోరాత్రాలు పని చేయించాడు. ఎద్దు ఆగినప్పుడల్లా కొరడాతో కొట్టాడు. ఆ ఎద్దు రోజుకు రెండుసార్లు మాత్రమే మేత తినటానికి ఆగేది. ఇలా అయిదు సంవత్సరాలు గడిచాక ఒకనాడు గానుగ పైకప్పు కూలి ఎద్దుకు స్పృహ తప్పింది.

తిరిగి స్పృహ వచ్చేసరికి రాజు మనిషి రూపంలో ఒక కొత్త దేశంలో ఉన్నాడు. అంత దూరాన కోనేటి దగ్గిర ఆడవాళ్లు బట్టలు ఉతుకుతూ, స్నానాలు చేస్తున్నారు. రాజుకు ఆకలి అవుతున్నది.

అంతలో ఎవరో ఒక వ్యక్తి రాజును సమీపించి, "ఎవరు నువ్వు? ఈ దేశంవాడివి కావే?" అన్నాడు.

"కాను. నాకు ఆకలి అవుతున్నది," అన్నాడు రాజు.

"ఈ దేశంలో భార్య పెడితే తప్ప ఎవడికీ తిండి ఉండదు. నీకు భార్య ఉన్నదా?" అన్నాడు ఆ వ్యక్తి.

"ఎక్కడో మా దేశంలో ఉన్నది," అన్నాడు రాజు.

"అయితే ఒంటరిదాన్ని చూసి వెంటనే పెళ్లాడు. నీకు తిండి దొరుకుతుంది,"

అన్నాడా వ్యక్తి. రాజు కొంచెంసేపు ఆలోచించి ఏమీపాలుపోక "ఎలా పెళ్ళాడటం?" అని వాణ్ణి అడిగాడు.

"ఆ నీలాటిరేవు నుంచి వచ్చే ప్రతి ఆడదాన్నీ, 'నీకు పెళ్ళయిందా? లేక ఒంటరిదానవా?' అని అడుగు. అలా ప్రతి స్త్రీనీ అడగాలిసుమా. ఎవరినీ వదిలిపెట్టరాదు. వారిలో ఒంటరి మనిషి ఎవతె అయినా ఉంటే వెంటనే నీకామె భార్య అవుతుంది," అంటూ వ్యక్తి ముందుకు సాగివెళ్ళాడు.

రాజు అక్కడే నిలబడి నీలాటి రేవువేపు చూశాడు. ఒక పదహారేళ్ళ అందగత్తె బిందె చంకన పెట్టుకుని అటుగా వచ్చింది. "అమ్మాయీ, నీకు పెళ్లి అయిందా? లేక ఒంటరిదానవా?" అని అడిగాడు రాజు

"కిందటేడే పెళ్లయింది?" అంటూ ఆమె ముందుకు సాగింది. ఆమె వెనకగా ఒక యాభైఏళ్ళ వృద్ధురాలు వచ్చింది. రాజు భయపడుతూ ఆమెనుకూడా అలాగే ప్రశ్నించాడు. "పెళ్లి అయింది, నాయనా!" అంటూ ఆమె వెళ్లిపోయింది. ఆమె వెనక ఒక ఎనభైఏళ్ళ బోసినోటి ముసలిది చేతకర్రపట్టుకుని వచ్చింది. రాజు నవ్వుతూ ఆమెనుకూడా అలాగే అడిగాడు.

"నేను ఒంటరిదాన్ని. ఇంటికి పోదాం పద!" అంటూ ముసలిది రాజు చెయ్యి



పట్టుకుంది. రాజు విడిపించుకోవటానికి ప్రయత్నించేసరికి ముసలిది గొంతెత్తి నలుగురినీ కేకలు పెట్టింది.

ఈ లోపల రాజు ఎలాగో ముసలిదాని పట్టు తప్పించుకుని కోనేటి వద్దకు పరిగెత్తి అందులో దూకేశాడు.

రాజు నీటిలోనుంచి మళ్ళీ పైకి లేచేసరికి ఆయన తన క్రీడాసరస్సులోనే ఉన్నాడు. గట్టున మునిమాత్రం లేడు. ఆయన స్నానం ముగించి ఇంట్లోకి వచ్చేశాడు. కాని ఆయన కిప్పుడు ఏది చూసినా ఆనందంగానే ఉన్నది. తన ఇల్లు స్వర్గంలాగున్నది. భార్యలు అప్సరసలలాగున్నారు, తిండి అమృతంలాగున్నది, పరిచారకులు దేవతల్లాగున్నారు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, నాకొక్క సందేహం. శౌనకమహాముని రాజు మనోవ్యాధిని ఎలా పోగొట్టాడు? ఆయన రాజుకు కొత్తసుఖాలు చూపటానికి బదులు కష్టాలు చూపటానికి కారణమేమిటి? సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల వెయ్యి చెక్కలవుతుంది," అన్నాడు.

"సుఖాలన్నవాటికి పరిమితి ఏమీలేదు. సత్యజిత్తుకు అన్ని సుఖాలూ ఉండికూడా అనుభవించే శక్తి కోల్పోవటంచేత మనోవ్యాధి పాలయాడు. శౌనకమహాముని కొత్త సుఖాలను చూపినా త్వరలోనే వాటితో రాజుకు ముఖం మొత్తేదే. అందుచేత మహాముని రాజుకు సుఖాలు అనుభవించే శక్తిని తిరిగి ఇచ్చాడు. ఇది కష్టాలు అనుభవించటంద్వారా మాత్రమే పునరుజ్జీవనం పొందుతూ ఉంటుంది. అందుచేతనే మహాముని చేసిన చికిత్స రాజు మీద పారింది," అని విక్రమార్కుడు జవాబిచ్చాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)






# ప్రకృతి వింతలు

## 5

మేము ఝరి చివరకు సమీపించే సమయంలో వాడు కత్తి పైకెత్తాడు. దానికి ఒక టేకిచేప గుచ్చుకునిఉన్నది. అది వెడల్పుగా ఉన్నది. దానికి పొడుగాటి తోకా, దాని చివర ఒక పూసా ఉన్నది.

మేము ఝరిని దాటివెళ్లాక ఆ కుర్రవాడు నాకా చేపను గురించి చెప్పాడు. అది లోతులేని నీటిలో ఇసకలోనూ, బురదలోనూ దూరి ఉంటుందట.

ఎవరుగాని పొరపాటున దానిపై కాలు వేస్తే అది తోకతో కాటువేస్తుంది. ఆ విషానికి ప్రాణం పోదుగాని చాలా బాధపెడుతుంది. ఈ టేకిచేపలకు భయపడే వాడు నీటిని కత్తితో పొడుస్తూవచ్చాడు.

రెండుగంటలు తెడ్లు వేసి మేము మా నౌక మునిగిన చోటికి వచ్చాం. మేము వెళ్లినప్పుడది ఎలా ఉన్నదో ఇప్పుడూ అలాగే ఉన్నది. మధ్యాన్నమయింది. అప్పటికే ఆకలిగొని ఉన్న నా అనుచరులు మమ్మల్ని చూసి చాలా సంతోషించారు.

మేము తెచ్చిన చేపలు మొత్తం పదహారు. అందులో మణుగు పైచిల్లర బరువున్నవికూడా ఉన్నాయి. వాటిని మంటల మీద కాల్చటానికి కుర్రవాడు కర్రలు తయారుచేశాడు.

పడవను ఒడ్డుకు లాగి మరమ్మతు చెయ్యటానికి పదకొండు గజాల తాడు కావాలి. పడవకు తాడు కట్టి అందరూ పట్టి లాగితే పని జరుగుతుంది; కాని తాడేలేదు. ప్రయాణీకులీ విషయం మాట్లాడుకుంటూ ఉండటం విని కుర్రవాడు, "భోజనాలయాక తాడు తయారుచేద్దాం," అన్నాడు.

టిబోర్ సెకెల్య





కొందరికి ఇది అసంభవంగా తోచింది. ఇది గ్రహించి వాడు, "అడవిలో మనిషికి కావలిసినదంతా ఉన్నది. దాన్ని ఉపయోగించుకోవటం తెలియాలి, అంతే!" అన్నాడు.

"ఈ కుర్రవాడు మనకు చాలా సహాయపడ్డాడు. మననుంచి ఏమి ప్రతిఫలం కోరుతాడో?....ఏంరా, అబ్బీ, ఈ చేపల కెంత డబ్బు ఇవ్వమంటావు?" అన్నాడు పడవ సరంగు. "నాకు డబ్బు అక్కర్లేదు. మనిషికి కావలిసినదంతా అడవిలో దొరుకుతుంది," అన్నాడు కుమేవావా.

ఈ మాట విని అందరూ హర్షించారు. అయినా ప్రయాణీకులు తమకు తోచినది ఒక సంచీలో వేసి వెళ్ళిపోయేటప్పుడు కుర్రవాడి కిప్పదలిచారు.

భోజనాలయాక తాడు తయారుచేసే పని పడింది. ప్రయాణీకులను కొంతమందిని తనవెంట తీసుకుని కుమేవావా అడవిలోకి బయలుదేరాడు. అరవై గజాల దూరం వెళ్ళాక విసనకర్రలలాటి ఆకులు గల చెట్టొకటి, పోకచెట్టు జాతిది, కనిపించింది. అది అటే ఎత్తు లేదు. కుర్రవాడు ఒక ఆకు విరిచి పది నారపోగులు తీసి చూపుతూ, "ఇదుగో, మీ తాడు!" అన్నాడు.

వాడు తమను వేళాకోళం పట్టిస్తున్నాడని సరంగుకు కోపం వచ్చింది.

"నేను వేళాకోళం చెయ్యటం లేదు. ఇలాటి నారపోగులు చాలా కలిపితే చిన్న తాడవుతుంది. అలాటి చిన్న తాళ్ళు కలిపి పేనితే పెద్ద తాడు. చూడండి," అంటూ వాడు ఆ పోగులను తన తొడమీద పరిచి చేత్తో రాచి దారం పేని చూపాడు. ఆ దారం చాలా బలంగా ఉన్నది. అలాటి దారాలు మూడు కలిపి పేని ఆ తాడును వాడు సరంగుచేతి కిచ్చాడు.

ఆ తాడును తెంచటం ఎవరివల్లా కాలేదు.

"బాగానే ఉన్నదిగాని ఈ లెక్కన పదకొండు గజాల తాడు పేనటానికి నెలరోజు



లకు తక్కువ పట్టదు," అన్నాడు సరంగు. "అందరూ కలిసి పనిచేస్తే సాయంకాలంలోగా తాడు తయారవుతుంది. ఇలాటి చెట్లు వెతికి, సాధ్యమైనంత పొడుగైన పోగులు తీసుకురండి. తాడు పేనుతాను," అన్నాడు కుమేవావా.

అందరమూ అలాటి చెట్లకోసం వెతికాం. కొందరికి అవి దొరికాయి. ఒక్కొక్కరే సన్నని పోగులు ఆ చెట్ల ఆకులనుంచి తెచ్చి కుర్రవాడికి ఇస్తుంటే వాడు వాటితో తాడు పేనసాగాడు. ప్రయాణీకులలో ఒక యువకుడు తానుకూడా తాడు పేనటం నేర్చుకున్నాడు. తరవాత మూడోవాడుకూడా తయారయాడు.

కొంతసేపటికల్లా ఆ ముగ్గురూ కలిసి పేనిన తొమ్మిది తాళ్ళు పెనసలు లావున, ఇరవై గజాల పొడుగున తయారయాయి. వాటిని కలిపి పేనగా 15 గజాల పొడుగు గల పడవమోకు తయారయింది.

కుమేవావాపైన అందరికీ గౌరవం హెచ్చింది. ఆ మోకుతో మర్నాడు పడవను ఒడ్డుకు చేర్చటానికి నిర్ణయం జరిగింది.

చీకటి పడగానే అందరమూ మంట చుట్టూ చేరుకున్నాం. ప్రయాణీకులలో ఒక స్త్రీ కుమేవావా చెక్కిళ్ళపై ఉన్న



వలయాలను గురించి అడిగింది. ఆ కుర్రవాడు వాటి సంగతి వివరంగా చెప్పాడు :

జరజా జాతి ఇండియన్లలో బాలబాలికలు ఈ వలయాలకోసం ఆత్రంగా ఎదురు చూస్తారు. ఇవి వేయించుకుంటే పెద్ద వాళ్ళలో జమ. ఈ వలయాలు వేయించుకున్న యువకుడు ఇతరులతో కలిసి వేటాడవచ్చు, నృత్యాలు చెయ్యవచ్చు, మంత్రవిద్య నేర్చుకోవచ్చు, పెళ్ళికూడా చేసుకోవచ్చు. కాని ఈ వలయాలు సులువుగా లభించవు. వీళ్ళతో వాటికి నిమిత్తం లేదు. ఇవి సంపాదించగోరేవారు అడవిలో ఇతరుల సహాయం లేకుండా ఒంటరిగా జీవించాలి.





ఈ జాతిలో మగపిల్లలు అయిదో ఏట బాణాలు వెయ్యటం నేరుస్తారు. ఏడో ఏట వారి విల్లూ, బాణాలూ వారే తయారుచేసుకుంటారు. తొమ్మిదేళ్ళకు తేనెపట్లు పట్టుకు వస్తారు. కుమేవావా అలాగే పెరిగాడు. వాడు అదివరకే పెద్దవాళ్ళతో చేపల వేటకూ, మృగాల వేటకూ పోతున్నాడు. ఏదైనా మృగాన్ని వాడు కొట్టలేకపోతే వెనకనుంచి పెద్దవాళ్ళు కొడతారు, అంతేగాని వాణ్ణి చూసి నవ్వరు.

ఒకనాడు వాళ్ళ నాయకుడు కుమేవావాకు రెండు ఎండుకట్టెలిచ్చి, వాటిని మథించి నిప్పుచెయ్యమన్నాడు. ఎంతోసేపు మథించినమీదట నిప్పుపడింది.

కిందటేడే వాణ్ణి పదిహేనేళ్ళ పిల్లల జట్టులో చేర్చారు. ఏడాదిపాటు వాళ్ళు అడవిలో అంతటా వేటాడారు. ఒక గురువు వారివెంట ఉండి వేట నేర్పాడు. ఆఖరు నెలరోజులపాటు మాత్రం గురువు వెంట లేకుండా కుర్రవాళ్లే వేటాడారు. విద్య పూర్తి అయి వాళ్ళు తమ గ్రామానికి తిరిగి రాగానే వాళ్ళకు పెద్ద పరీక్ష పెట్టారు. వాళ్ళకు రకరకాల అడవిమృగాల కాళ్ళ గుర్తులు చూపి మృగాలను పోల్చమన్నారు, తరవాత వాటిని కొట్టి తీసుకురమ్మన్నారు. ఈతలో, గురిలో, పరిగెత్తటంలో, గుడిసెలు నిర్మించటంలో పోటీలు జరిగాయి. పోటీ ఫలితాలను జాతివాళ్ళంతా కలిసి నిర్ణయించారు. కొందరిని పెద్దవాళ్లలో చేర్చారు, మరికొందరిని ఇంకొక ఏడు శిక్షణ పొందమన్నారు. నెగ్గినవాళ్ల చెక్కిళ్లపైన మాంత్రికుడు వలయాలు కాల్చాడు. కాల్చినప్పుడు కుమేవావాకు దుర్భరమైన బాధ కలిగింది, కాని దాన్ని వాడు సహించాడు. పెద్దవాడు కాగోరేవాడు పైకి ఏడవరాదు. తరవాత మాంత్రికుడు కాలిన వలయాలకు రంగు పూశాడు. ఆ రంగు ఎప్పటికీ ఉంటుంది.

—(ఇంకా ఉంది)



# తమాషాలు

[గతనెల ప్రశ్నలకు సమాధానాలు]

1. ఆరుగురు విద్యార్థులు ఒక బెంచీమీద కూచున్నట్టు కూచోకుండా మారి కూర్చోవటానికి రెండేళ్లు పడుతుంది. అందుచేత వారు మొదటి రోజు కూచున్న విధంగా మళ్లీ కూచునేలోపుగా బియ్యే చదువు పూర్తి అవుతుంది.

2.
```
     415
     382
    ----
     830
    3320
   1245
  ------
  158530
```

3. 987, 652, 413

---

1. కూరల అంగడిలో వెలగకాయలు కొనబోయాను. దుకాణంవాడు రెండు కుప్పలు చూపాడు. ఒక కుప్పలో కాయలు కొంచెం పెద్దవి, మూడేసి అంగుళాల లావున్నాయి. రెండో కుప్పలోవి కొద్దిగా చిన్నవి, రెండున్నర అంగుళాలు లావు. పెద్ద వెలగకాయ ఖరీదు అణా, చిన్నదాని ఖరీదు మూడు కాన్లూ చెప్పాడు అంగడివాడు.

పెద్దవి కొనటం లాభమా? చిన్నవి కొనటం లాభమా?

2. మా ఇంటో రెండు నేతి ఝారీలున్నాయి. అవి ఒకే ఆకారం గలవి. మేము నెయ్యిచేసినప్పుడు అవి రెండూ నిండేటంత నెయ్యి వస్తుంది. ఒకసారి భోజనాలకు కూచోబోయేముందే నెయ్యి కాచి రెంటినీ నింపి, అది చల్లారటానికి వేచిఉండవలిసి వచ్చింది.

ముందు చల్లారిన నెయ్యి ఏ ఝారీలోది? పెద్దదానిలోదా, చిన్నదానిలోదా?

3. తెనాలినుంచి రేపల్లెకు గల రైలుదారిలో 8 స్టేషనులున్నాయి. ఈ ఊళ్లమధ్య తిరిగే ప్రయాణీకులు ఎన్ని రకాల టిక్కెట్లు కొంటారో చెప్పగలరా?

[సమాధానాలు పై సంచికలో]

# తగని బాధ్యతలు

ఒక కుంతా, మట్టిముద్దా, తోటకూర స్తంభమూ, ఈగా, సూదీ కలిసి కాపరం పెడదామనుకున్నాయి. ఇంటి పనులను అవి ఈ విధంగా ఏర్పాటు చేసుకున్నాయి : మట్టిముద్ద నీరు తేవాలి ; తోటకూర స్తంభం ఆవును కాయాలి ; సూది ఇల్లు ఊడ్చాలి ; ఈగ ఎద్దును కాయాలి; కుండ ఇంటి పెత్తనం చెయ్యాలి.

అందరూ పనులమీద బయలుదేరారు.

నీరు తేబోయిన మట్టిముద్ద నీటిలో కలిసిపోయింది.

ఆవుకు ఆకలేసి, తనను తోలే తోటకూర స్తంభాన్ని కాస్తా తినేసింది.

ఎద్దును తోలే ఈగపైన ఎద్దు కడి వేసింది ; ఈగ అందులో చిక్కుకు పోయింది.

ఇల్లు చిమ్మటానికి చీపురుకట్ట కోసం వెతుకుతూ సూది చీమల బొక్కలో పడిపోయింది.

ఇంటిపెత్తనంచేసే కుండ మిగిలినవారేమయారో చూడాలని అటకమీది నుంచి కిందికి దూకి ముక్కలైపోయింది.



## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1959 జనవరి సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ నవంబరు నెల 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:-చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ. మద్రాసు-26.

## నవంబరు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : గ్రామసింహము

రెండవ ఫోటో : శాంతిచిహ్నము

పంపినవారు : ఎ. వెంకట్రామయ్య,

8-వ తరగతి, శ్రీకొలను పోస్టు, (వయా) సంగం, ఆత్మకూరు తా॥ (నెల్లూరు జిల్లా)

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# చిత్రకథ





ఒకరోజున దాసూ, వాసూలు 'టైగర్' ను వెంటబెట్టుకుని తోటలోనుంచి వెళుతూ వుండగా, ఒక పొదఛాటునుంచి వికృతమైన అరుపులు రాసాగినై. ఆ అరుస్తున్నది ఏదో వింత మృగమని దాసూ వాసూలు భయపడ్డారు. ఇంతలో 'టైగర్' చడీచప్పుడూ లేకుండా పొదలచాటుకు వెళ్ళి, అక్కడ వికృతంగా అరుపులు వస్తున్నది ఒక పెద్ద బూరనుంచి అని తెలుసుకుని దానిమీదికి ఎగిరి గంతేసింది. దానితో బూరా వెనకవుండి, ఈ నాటకం ఆడుతున్న కొంటెకుర్రాడు తారుకుని కేకలుపెడుతూ అక్కడినించి పారిపోయాడు.






Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by him for Chandamama Publications, from Madras 26.—Controlling Editor: SRI 'CHAKRAPANI'

Photo by M. V. Vijayakar



బహుమతి
పొందిన వ్యాఖ్య

శాంతిచిహ్నము

పంపినవారు :
ఎ. వి. రామయ్య - శ్రీకొలను

